అపరాధ పరిశోధన అనుబంధం—82

16 9/80

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నాలుగవ అస్థిపంజరం

రచన: వసుంధర

## మంత్రగాళ్ళ మరణం

రచన: వాణిశ్రీ

## ఫోన్ నెంబర్ పన్నెండు

రచన: ప్రతాప రవిశంకర్

## ఈ రాత్రి తెల్లారదు

రచన: సికిందర్

పొగమంచు—పదవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 82**
అక్టోబర్, 1980
వెల: రు. 4-50
ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నాలుగవ అస్థిపంజరం!

## వసుంధర

రమణరావు సముద్రపుటొడ్డున అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. మిత్రుడు పరశురాం కోసం అతను చాలా సేపునుంచి ఎదురుచూస్తున్నాడు. అన్న టైముకు రాకపోవడం పరశురాం ప్రత్యేకత అని తెలిసికూడా అతను విసుక్కోకుండా ఉండలేకపోతున్నాడు.

అయితే అనుకోకుండా రమణరావు విసుగు దానంతటదే మాయమయింది. అందుక్కారణం పరశురాం రాక కాదు. మెరుపుతీగలాంటి ఓ అమ్మాయి అతనికి కాస్త దరిదాపుల్లోనే వచ్చి కూర్చుంది. ఆమె కళ్ళబడగానే రమణరావు అన్ని ఆలోచనలూ మరిచిపోయి కొద్దిసేపు పచార్లుకూడా మానేసి ఏకాగ్రతతో ఆమె వంకనే చూస్తూ ఉండిపోయాడు.

ఆమె వయస్సు ఇరవైకిలోపే ఉండాలి. మిసమిసలాడే యౌవనం. గులాబిరంగు వెన్నలా ఉన్నాయి ఆమె బుగ్గలు. ఆమె కనులు అడవిలోని లేడిని గుర్తుచేస్తున్నాయి.

ఆమెకట్టిన చీర ఆమెకెంతవరకూ అందాన్నిచ్చిందో చెప్పడం కష్టంకానీ తను మాత్రం అద్భుత సౌందర్యాన్ని సంతరించుకుంది.

అలాంటి అమ్మాయి తనకు కొద్దిగజాల దూరంలో ముఖం తనకు కనబడేలా కూర్చున్నప్పుడు రమణరావుకు పరశురాం ఎలా గుర్తుకొస్తాడు?

కాసేపటికి రమణరావు ఈ లోకంలోకి వచ్చాడు.

నేలకు తగిలిన రబ్బరుబంతి పైకి ఎగిరినా మళ్ళీ కాసేపటికి క్రిందకు రావలసిందేకదా! రమణరావు మనసుకూడా వాస్తవంలోకి వచ్చిందికానీ దానిలో ఇప్పుడు పరశురాంకు చోటులేదు. ఆ అమ్మాయి ఎవరో అన్న కొత్త ఆలోచనలతో అతడి మనసు నిండిపోయింది.

మనిషికి ఆలోచనాశక్తి పనికొస్తుంది కానీ అన్ని ప్రశ్నలకు అది జవాబు ఇవ్వలేదు. అతడి మనసులో ఇప్పుడున్న ప్రశ్నకు జవాబివ్వగలిగేది ఆలోచనాశక్తి కాదు. ఆ అమ్మాయే!

స్వతహాగా రమణరావుకు చొరవ ఎక్కువ. అతడు ధైర్యంగా ముందడుగువేసి ఆ అమ్మాయికి సమీపంలోనే కూర్చుంటూ—"మీరు అన్యథా భావించరనుకుంటాను" అన్నాడు.

ఆ అమ్మాయి అతనివంక ఎగాదిగాచూసి...."ఈ బీచి అందరిదీనూ— ఇక్కడ మీరు కూర్చుంటే నాకు అభ్యంతరమెందుకు?" అంది తియ్యగా.

ఆమె సమాధానం వింటూనే రమణరావు ఆమెకు కాస్త దగ్గరగా జరిగాడు—"ఈ బీచి మీది కాకపోవచ్చు. కానీ మీలో ఏదో ప్రత్యేకత ఉంది. ఇక్కడ కూర్చున్న మిమ్మల్ని చూడగానే ఈ బీచి మీదేననీ—మీ

అనుమతిలేనిదే ఇక్కడ కూర్చోరాదేమోననీ అనిపించింది. అందుకే అలా అడిగాను—"

ఆమె సిగ్గుపడింది. సిగ్గు అనేది భగవంతుడు ఆడవాళ్ళ కోసమే సృష్టించి ఉండాలి. ఆడదాని సిగ్గు మగవాడిని ఎంతగా ఆకర్షిస్తుందో చెప్పడం కష్టం. రమణరావు సిగ్గుతో ఎరుపెక్కిన ఆమె బుగ్గల్ని చూస్తూ "ఈరోజుకు నాజన్మ ధన్యమైంది!" అనుకున్నాడు:

ఇద్దరూ కాసేపు మౌనంగా ఉన్నారు. తర్వాత రమణరావే నెమ్మదిగా మళ్ళీ మాటలు ప్రారంభించి ఆమెను వివరాలడిగాడు.

ఆమె పేరు కౌముది. ఆమెకు నా అన్నవాళ్ళెవ్వరూ లేరు. కానీ డబ్బుంది.

"అదెలా సాధ్యం—అందులోను ఆడపిల్లకి!" అన్నాడు రమణరావు ఆశ్చర్యంగా.

"నా తండ్రికి బంధువులంటే అసహ్యం. అందుకని ఆయన ఎప్పుడూ వారందరికీ దూరంగానే ఉన్నాడు. మా అమ్మ పోగానే ఆయన వ్యాపారం మానేశాడు. అయిదు లక్షలు బ్యాంకులో నా పేరున ఫిక్స్‌డ్ డిపాజిట్లో వేశాడు. నాకు పదహారేళ్ళు రాగానే ఒకరోజు నాకు జీవితం గురించి పాఠాలు చెప్పి "నీకు సరైన వరుణ్ణి నువ్వే ఎన్నుకుని నేనిచ్చిన డబ్బుతో జీవితం హాయిగా గడుపు—" అని చెప్పి నాకు తెలియకుండా ఆ రాత్రే నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఆయనేమయ్యాడో తెలియదు నాకు. రెండేళ్ళనుంచి నేను ఒంటరిపక్షిని" అందామె.

ఇంత అందం రెండేళ్ళనుంచి ఒంటరిగా ఉందని తెలియగానే రమణరావు మనసు ఏదోలా అయిపోయింది. ఆమె ఒంటరితనం పోగొట్టడానికి తను సాయపడాలని

అతననుకున్నాడు. అంతేకాదు తను మాత్రమే సాయపడా లనికూడా అతననుకున్నాడు. అలా అనుకుని తన కథ నతనామెకు చెప్పాడు.

రమణరావు తండ్రి లక్షాధికారి. అతను యూని వర్సిటీలో రీసెర్చి చేస్తున్నాడు. ఫారిన్ వెళ్ళాలని అతని కుంది. బిజినెస్‌లో పెట్టాలని తండ్రి అనుకుంటున్నాడు.

"నిర్మొహమాటంగా అనేస్తున్నానని ఏమీ అనుకో కండి—మీవంటి సౌందర్యరాశి తోడులభిస్తే అటు విదే శాలూ వెళ్ళను ఇటు వ్యాపారమూ చెయ్యను—" అన్నాడు రమణరావు.

"మరేం చేస్తారు?" అంది కౌముది కుతూహలందా.

"ఆమె చెప్పినట్లే చేస్తాను...." అన్నాడు రమణరావు.

కౌముది నవ్వి "నేను చెప్పింది చేసినవారినే పెళ్ళి చేసుకోవాలని ప్రతిజ్ఞాపట్టాను. అందుకే ఎంత డబ్బున్నా రెండుసంవత్సరాలుగా నాకు వరుడు దొరకడంలేదు—" అంది.

రమణరావు కళ్ళలో ఆశ మెరిసింది—"మీరు చెప్పింది చేస్తాను. అప్పుడు మీరు నన్ను పెళ్ళి చేసుకుంటారా?" అన్నాడతను.

కౌముది నవ్వి "నేను చెప్పింది చేయగల మగవాడు ఈ భూమ్మీద ఉంటే ఉండవచ్చుగానీ మనదేశంలో ఉంటా డని మాత్రం నే ననుకోవడంలేదు—" అంది.

"మీరుచెప్పే పని ఏమిటో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు రమణరావు.

కౌముది ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

సరిగ్గా అప్పుడే పరశురాం వచ్చి రమణరావు భుజం మీద చేయివేసి "సారీ బ్రదర్! చాలా ఆలస్యమైంది"

అన్నాడు.

కానీ రమణరావు కిప్పుడు పరశురాం వచ్చినందుకు అసహనంగా ఉంది.

కౌముది తన వాచీ వంక చూసుకుని—"రేపు ఇదే టైముకి బీచికి వస్తాను" అని లేచి వెళ్ళిపోయింది.

"ఇంకెప్పుడూ నేను ఆలశ్యం చేయను బ్రదర్—నీకు చాలా కోపం వచ్చినట్లుంది" అన్నాడు పరశురాం. అతడికి తన ధోరణి తనదేకానీ ఎదుటివాళ్ళను అట్టే పట్టించుకోడు. అందువల్లనే కౌముది అతడి దృష్టిపథాన్నాకర్షించలేదు.

"నా కోపం సంగతికేం కానీ—రేపు నేను బీచికి వస్తున్నాను. నువ్వు ఆలశ్యం సంగతటుంచి—అసలు బీచికి రావద్దు. వచ్చావంటే మాట దక్కదు" అన్నాడు రమణరావు.

పరశురాం తెల్లముఖం వేసుకుని మిత్రుడివంకనే చూస్తూ వుండిపోయాడు.

## 2

"మీకు రోశయ్య తెలుసా?" అంది కౌముది.

"ఏ రోశయ్య?" అన్నాడు రమణరావు.

"శ్రీ వెంకటేశ్వరా వైన్ మర్చంట్సు...."

"రోశయ్యగారా? ఆయన నాకంటే మా నాన్నగారికి బాగా తెలుసు...." అన్నాడు రమణరావు.

"రోశయ్యను రోశయ్యగారు అనేవాళ్ళతో స్నేహం చేయడం నా కిష్టముండదు?" అంది కౌముది.

రమణరావు ఆమె వంక ఆశ్చర్యంగా చూశాడు. ఆమె బుగ్గలు ఎర్రగా కందాయి. అయితే ఆ ఎరుపు సిగ్గువల్ల రాలేదు. కోపంవల్ల వచ్చింది.

"రోశయ్యగా...." అని ఆగి—"రోశయ్య మీకు ఎలా తెలుసు?" అనడిగాడు రమణరావు.

"నాది మా అమ్మ పోలికే కానీ ఆమె అందం పూర్తిగా నాకు రాలేదు. రోశయ్య మా అమ్మను చంపేశాడు" అంది కౌముది.

"రోశయ్యగా....రోశయ్య.... హంతకుడా?" ఆశ్చర్యంగా అన్నాడు రమణరావు.

"అవును. వాడంటే నాకు నిలువెల్లా పగ...." అంది కౌముది. అప్పుడామె అందం నాగుపాములా బుసకొట్టింది.

"రోశయ్య హంతకుడా?"మళ్ళీ అన్నాడు రమణరావు.

అతడికి రోశయ్య బాగా తెలుసును. అతడికి తెలిసినంతవరకూ రోశయ్య పరమ నిష్ఠాగరిష్ఠుడు. ప్రతి శనివారమూ అతడు భజనలు చేయిస్తాడు. తను చేస్తాడు. ముఖంలో ఎప్పుడూ చెరగని చిరునవ్వు వుంటుంది. నుదుట విధిగా కుంకుమ వుంటుంది. ఎదుటివారు ఎంత మాటలన్నా చలించడు. అతడి వినయ గుణాన్ని, సహనశీలాన్ని ఊళ్లో చాలామంది ఆదర్శంగా చెప్పుకుంటారు.

ఆయన పేరు వినగానే ప్రతి ఒక్కడికీ గౌరవభావం కలుగుతుంది. తన నెవరైనా మెచ్చుకున్నప్పటికీ ఆయన-"పొట్టకోసం సారాయి వ్యాపారంచేసే నేను మంచివాడి నెలాగౌతాను? నన్నెవరెన్నివిధాల నిందించినా అది న్యాయమే!" అంటాడు. అలాగని సారాయి వ్యాపారము మానడు—"ప్రభుత్వం అనుమతించిన పని నేగదా నేనూ చేస్తున్నాను" అంటాడాయన.

"అవును. వాడు హంతకుడు...." అంది కౌముది.

"నేను నమ్మలేకపోతున్నాను. ఆయన నిజంగా హంతకుడే అయితే, నా వళ్ళు జలదరించి పోతోంది? ఆయనతో

నేను చాలా చాలా చనువుగా వుండేవాణ్ని" అన్నాడు రమణరావు.

"ఒక హంతకుడితో చనువుగా మసిలినందుకే మీ వళ్ళు జలదరించిపోతే ఎలా? నేను మిమ్మల్నే హంతకుణ్ని చేయాలనుకుంటున్నాను?" అంది కౌముది.

"ఏమన్నారూ?" అన్నాడు రమణరావు షాక్ తిన్నట్లు.

"మీరు నాకోసం కోశయ్యను చంపాలి!" అంది కౌముది.

రమణరావుకు ముచ్చెమటలు పోశాయి. ఏదో చెప్పాలనుకున్నాడు కానీ అతడికి నోట మాటరాలేదు.

"ఈ షాక్ తట్టుకోవడానికి మీకు సమయం పడుతుంది. రేపు ఇదే సమయానికి ఇక్కడ వుంటాను. మీరు మళ్ళీ కనబడకపోతే నేను మరో మనిషిని వెతుక్కుంటాను" అని వెళ్ళిపోయింది కౌముది.

## 3

రమణరావు ఇల్లు చేరాడు కానీ షాక్‌నుంచి మాత్రం తేరుకోలేదు.

కౌముది సౌందర్యం అసాధారణం. అటువంటి అందగత్తెను భార్యగా పొందగలిగితే అది అదృష్టమే! తనకు ఆమెను భార్యగా పొందే అవకాశం వచ్చింది. కానీ అందుకు తనో హత్య చేయాలి. అందులోనూ తనకు బాగా పరిచయమైన కోశయ్యను హత్యచేయాలి.

రమణరావుకు హత్యలు చేసేటంత గుండె దిటవుంటుందని ఎవ్వరూ అనుకోరు. అతను మాంసాహారం తరచు తీసుకోకపోయినా అప్పుడప్పుడు కోడిపులావు తింటాడు. అయితే కోడిని చంపుతూండగా చూస్తే మాత్రం రెండు

రోజులు మనసు పాడు చేసుకుంటాడు.

ఈ విషయమే ఆలోచిస్తున్న రమణరావుకు హఠా త్తుగా ఏదో స్ఫురించింది.

కోడిపులావు చేయాలంటే కోడిని చంపాలని తనకు తెలుసు. కాబట్టి కోడి చావుకు తను వ్యతిరేకుడు కాడు. తను కోడిపులావు అంటే బాగా ఇష్టపడతాడు కాబట్టి కోడి హత్యను ప్రోత్సహిస్తున్నట్లు కూడా అవుతుంది. అటు వంటప్పుడు తను హత్య చూడలేదు తప్పితే—హత్యలను ప్రోత్సహించడనుకోవడం సబబుకాదు. ఇదే సూత్రాన్ని మనుషులకు వర్తింపజేస్తే?

కౌముదివంటి అందాలరాశి తన స్వంతం కావాలంటే రోశయ్య చావాలి.

రోశయ్య కోడి. కౌముది కోడిపులావు.

కోడిని తను చంపలేడు. ఎవరైనా చంపుతూంటే చూడలేడు. కానీ తనకు కోడిపులావు కావాలి. ఎలా?

రమణరావుకు వెంటనే పట్టయ్య గుర్తుకొచ్చాడు.

పట్టయ్య కోళ్ళను చంపడు. మనుషుల్నే చంపుతాడు. కానీ తినడానికి వాడికి కోళ్ళు కావాలి. మనుషులు పనికి రారు. అందుకని ఒకోసారి వాడు కోళ్ళకోసం మనుషుల్నే చంపుతాడు. మనుషుల్ని చంపే పట్టయ్యకు పెద్దమనుషుల అండ వుంది. అందువల్ల వాడికి చట్టం గురించిన బాధ, భయం లేవు.

పట్టయ్య గురించి రమణరావుకు తెలుసు. రమణరావు తండ్రికూడా పెద్దమనిషే. ఆయనింటికి కూడా పట్టయ్య అప్పుడప్పుడు వచ్చి వెడుతూంటాడు. ఇంతకాలం రమణ రావుకు పట్టయ్యంటే భయం. కానీ ఈరోజు వాడి అవ సరం వచ్చినట్లు కనబడిందతనికి.

"నువ్వు భయపడే మనుషుల అవసరం నీకు వచ్చిందంటే సమాజంలో నీ అంతస్తు పెరుగుతున్నట్లే లెక్క!" అంటూ వుంటాడు అతడి స్నేహితుడు పరశురాం.

కౌముది వంటి స్త్రీని పొందగలిగితే సమాజంలో తన అంతస్తు పెరిగినట్లే లెక్క!

రమణరావు పట్టయ్య ఇంటికి వెళ్లాడు. అతడి అదృష్టం కొద్దీ పట్టయ్య ఇంట్లోనే వున్నాడు. అతన్ని చూసి గుర్తుపట్టి—"మీ నాన్న రమ్మన్నాడా?" అన్నాడు.

"మా నాన్న కాదు. నాకే అవసరం వచ్చింది—" అన్నాడు రమణరావు.

పట్టయ్య రమణరావును ఎగాదిగా చూసి—"నువ్వూ పెద్దాడివౌతున్నావన్నమాట!" అన్నాడు.

రమణరావు ఇబ్బందిగా ముఖంపెట్టి—"నాకో పని తగిలింది. చేసిపెట్టగలవా?" అన్నాడు.

"ఏమిటో చెప్పు!"

"ఓ మనిషిని చంపాలి!"

పట్టయ్య అదోలా నవ్వి "ఆస్పత్రుల్లోంచి బిడ్డల్నెత్తుకొచ్చాను. పెద్దిళ్ళలోంచి డబ్బులెత్తుకొచ్చాను. ఇదీ అదీ అనికాక రకరకాల నేరాలు చేశాను. ఎంతో అనుభవం సంపాదించాను. దీన్నిబట్టి నేను తెలుసుకున్నదేమిటో నీకు తెలుసా—అన్ని నేరాల్లోకీ సులువైనది హత్య!" అన్నాడు.

"అయితే చేస్తావా?" అన్నాడు రమణరావు.

"ఎంతిస్తావు?" అనడిగాడు పట్టయ్య.

"ఎంత కావాలో చెప్పు!"

"నా రేటు చాలా ఉంటుంది-ఫుట్‌పాత్ మీది పాంటు గుడ్డధరలాగా! నువ్వు బేరమాడకపోవడంలో ఉంటుంది

నాథర....” అన్నాడు పట్టయ్య.

“వివరాలన్నీ నీతో రేపు మాట్లాడతాను. నాకు పని చేసి పెడతానని మాటిచ్చావుగదా-అదిచాలు” అన్నాడు రమణరావు.

“అడ్వాన్సేమైనా ఇస్తావా?” అన్నాడు పట్టయ్య.

“అదీ రేపే!”

“అయిదొందలేనా అడ్వాన్సులేకుండా నేనెవరికీ మాటివ్వను. అడ్వాన్సిచ్చేదాకా నేను నీకు మాటిచ్చినట్లు కాదు—” అన్నాడు పట్టయ్య.

రమణరావు తేలిగ్గా నిట్టూర్చి “అడ్వాన్సిచ్చాక మాటిస్తావుగా. నీ దగ్గర నేను మాట రేపు తీసుకుంటాన్లే” అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇప్పుడతనికి ఒక ఉపాయం కనబడింది. రోశయ్యను చంపడం తనకిప్పుడు సమస్యకాదు. చంపడం అవసరమా, కాదా అన్న నిర్ణయం తీసుకునేందుకే కాస్త వ్యవధికావాలి.

సాయంత్రం అతను బీచికి వెళ్ళాడు. అక్కడ కౌముది అతడికోసం ఎదురుచూస్తోంది.

“రారేమోననుకున్నాను....” అందామె.

“మీ కోరిక కష్టమైనదే—కానీ మీ అందం నన్ను రప్పించింది—” అన్నాడు రమణరావు.

“నా అందం ఇంకా ఏంచేసిందో చెబితే విని సంతోషిస్తాను....” అంది కౌముది తాపీగా.

“మీ అందం నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది—”అన్నాడు రమణరావు.

కౌముది నిట్టూర్చి—“అందాన్నిచూసి పిచ్చెక్కితే—మీరింక మాత్రం ఏం చేయగలరూ?” అంది.

రమణరావు తడబడి — “అబ్బే — అదికాదు.

మామూలుగా అయితే నేను హత్యలు చేయలేను. ఇప్పుడు రోశయ్యను చంపాలనుకున్నానంటే అందుకు మీ అందం ఎక్కించిన పిచ్చే కారణమనుకుంటున్నాను" అన్నాడు.

"చాలా చమత్కారంగా మాట్లాడుతున్నారు మీరు. బాగా తెలివైనవాడు" అని ఆమె నిట్టూర్చి—"మనిషి తన తెలివితేటల్ని సాధారణంగా ఎదుటిమనిషిని మోసగించడానికే ఉపయోగిస్తాడు...." అంది.

"మీరన్నది ముమ్మాటికీ నిజం! నాకు సుపరిచితుడైన రోశయ్యను చంపడానికి నా తెలివితేటల్నుపయోగించబోతున్నానుకదా!" అన్నాడు రమణరావు.

కౌముది అతడి కళ్ళలోకి సూటిగా చూస్తూ— "అయితే మీరు రోశయ్యను చంపాలని నిర్ణయించుకున్నారన్నమాట. చాలా థాంక్స్!" అంది.

"ఇప్పుడు మీరు నాకు మీ కథ మరి కాస్త వివరంగా చెప్పాలి—" అన్నాడు రమణరావు.

"నేను చెప్పాల్సిందేమీ లేదు. మీరే చెప్పాలి.... రోశయ్యనెలా చంపబోతున్నారో...."

"వివరాలు పట్టయ్యనడిగి చెబుతాను...." అన్నాడు రమణరావు.

"పట్టయ్యా—వాడెవడు?"

"కిరాయి హంతకుడు. రోశయ్యను చంపడానికి వాణ్ణి నియోగించాను...." అన్నాడు రమణరావు.

కౌముది అసంతృప్తిగా "మధ్య ఈ పట్టయ్యెందుకు? రోశయ్యను మీరు చంపలేరా?" అంది.

"పనిచేసేటప్పుడు మన చేతులకు మట్టి అవకూడదు. రోశయ్యను చంపి నేను ఉరికంబం ఎక్కాలనుకోవడం లేదు. మీ మెడలో తాళికట్టాలనుకుంటున్నాను" అన్నాడు

రమణరావు.

"ఉరికంబాన్ని, నా మెడలో తాళిని కలిపిమాట్లాడ్డం నాకు నచ్చలేదు. అయినా రోశయ్యను చంపితే ఉరికంబం ఎక్కడమెందుకు?" అంది కౌముది.

"రోశయ్యను చంపినందుకు మీరు నాకు పూలమాలలు వేయొచ్చు. కానీ ప్రభుత్వం అలా చేయదుకదా!"

"ఏడ్చినట్లుంది! మీరు రోశయ్యను ఏ కోర్టుకో తీసుకెళ్ళి అక్కడి జడ్జి వచ్చేదాకా ఆగి అప్పుడు చంపాలనుకొంటున్నారా?" అంది కౌముది.

రమణరావుకు ఒక నిముషం నోటమాటరాలేదు.

కౌముది చాలా తెలివైనది. మాటలుకూడా తెలివిగా ఆడుతోంది - ఆమె మనసులో ఉద్దేశ్యం ఆమెద్వారానే తెలుసుకోవడం మంచిది. ఆ విషయం అతనామెకు చెప్పాడు.

కౌముది కోరుతున్నది వరపరీక్ష. ఆమెను వివాహం చేసుకోదల్చినవాడు రోశయ్యను ఆమె కళ్ళెదుట స్వయంగా చంపాలి.

రమణరావు వణికిపోతూ "ఇదేం వరపరీక్ష! భర్తను హంతకుణ్ణి చేయాలనుకునే ఆడది ఉంటుందా?" అన్నాడు.

"నేనున్నాను. కానీ హత్యగురించి మీకు భయంలేదు. రోశయ్య చనిపోయేక ఆ శవాన్ని ఏం చేయాలో నాకు తెలుసు. అవన్నీ నేను చూసుకుంటాను. మీమీద హత్యానేరం మోపబడదు. కానీ హత్యమాత్రం మీరే చేయాలి?"

"నేనే ఎందుకు?" అన్నాడు రమణరావు.

"నన్ను వివాహం చేసుకోవాలన్నకోరిక మీకు లేకపోతే రోశయ్యను చంపాల్సిన అవసరం మీకు లేదు"

"అయితే మనం రేపు మళ్ళీ కలుసుకుందాం—"

అన్నాడు రమణరావు.

"రేపు మనం కలుసుకునేది కార్యక్రమాన్ని నిర్ణయించడానికి. కాని పక్షంలో అదే మన ఆఖరి కలయిక అవుతుంది—" అంది కౌముది.

# 4

పట్టయ్యాద్వారా తన పని సులభమవుతుందని భావించిన రమణరావుకు ఆశాభంగమే అయింది.

తనిప్పుడేం చేయాలి? కౌముది కోరిన ప్రకారం రోశయ్యను హత్యచేయాలా?

ఆ ఆలోచనకే అతడి ఒడలు జలదరించింది.

చాలాసేపు ఆలోచించేక అతడి ఊహలు కొత్త దారికి మళ్ళాయి.

రోశయ్య ధర్మాత్ముడు. పుణ్యాత్ముడు. తనను అభిమానంగా చూస్తాడు. తను అతడి అభిమాని.

అలాంటి రోశయ్యను అసలు చంపడం ఎందుకు?

విషయమంతా వివరంగా రోశయ్యకే చెబితే ఆయనే ఏదో ఉపాయం చెబుతాడు.

తనకు అనుభవం తక్కువ. అసలీ కౌముది ఎవరో—రోశయ్యపై ఆమె ఎందుకు పగబట్టిందో—తన పగ తీరాక ఆమె తన్ను ఆదరిస్తుందో, ఆదరించదో....ఇవన్నీ ఎలా తెలుస్తాయి?

రమణరావు రోశయ్యను కలుసుకుని తనకు జరిగిన అనుభవం చెప్పాడు.

రోశయ్య అంతా విని అనుమానంగా రమణరావు వంక చూసి— "ఆ అమ్మాయి నిన్ను కలుసుకుని ఎంతకాలమైంది?" అన్నాడు.

రమణరావు చెప్పాడు.

"వెంటనే నాకీ కబురు చెప్పొద్దూ? ఇంత ఆలస్యంగానా నాకు చెప్పేది! అంటే నీలో నన్ను చంపాలన్న ఆలోచన కూడా కొంతకాలం వచ్చి ఉండాలి—" అన్నాడు రోశయ్య.

"అబ్బే—లేదండి...." అన్నాడు రమణరావు.

"మరింత జాప్యమెందుకు చేశావు?" అన్నాడు రోశయ్య.

"జరుగుతున్నది కలో, నిజమో తెలుసుకోడానికే ఈ కాస్త వ్యవధీ అయింది—" అన్నాడు రమణరావు.

రోశయ్య ఆలోచనలో పడ్డాడు. ఆయన ముఖం గంభీరంగా అయిపోయి చాలాసేపు అలాగే ఉండిపోయింది.

రమణరావు ఆయన చెప్పేది వినడం కోసం ఆత్రుతగా ఎదురుచూస్తూ ఉండిపోయాడు.

"నీకు పట్టయ్య తెలుసా?" అన్నాడు రోశయ్య కాసేపటికి.

"తెలుసండి—"

"అయితే వాణ్ణి కలుసుకుని ఓ హత్యకు బేరమాడు" అన్నాడు రోశయ్య.

"ఎవర్ని చంపాలి?"

"కాముదిని...."

రమణరావు కంగారుగా— "నేనామెను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను...." అన్నాడు.

రోశయ్య నవ్వి "నువ్వు మగాడివి-మగాడిలా మాట్లాడ్డం నేర్చుకో—" అన్నాడు.

"అంటే?"

"నేనో ఉపాయం చెబుతాను. ఆ ప్రకారం నువ్వామెను

నమ్మించి మోసం చేయొచ్చు. నన్ను చంపినట్లు భ్రమపెట్ట వచ్చు. ఆ తర్వాత ఆమె నీ వశమౌతుంది. కొంతకాలం కలిసుండండి. తన పగను మరచిపోయి నీతో అడ్జస్టయిందా సరేసరి-లేదా ఆమెను పట్టయ్యాక అప్పజెప్పవచ్చు. ఆమె మీద నీమోజు తీరిపోడానికి వారం రోజులు చాలని నా అనుమానం—"

రమణరావు ఆశ్చర్యంగా ఆయనవంక చూశాడు.

"తెలివైన ఆడది మగాడికి ప్రమాదం. అందులోనూ మగాణ్ణి హత్యలకు పురికొల్పే ఆడది ఇంకా ప్రమాదం. అందంగా ఉందంటున్నావ్ కాబట్టి కొన్నాళ్ళు అనుభవించి చంపేయ్—" అన్నాడు రోశయ్య.

హఠాత్తుగా రోశయ్య కళ్ళలో క్రూరత్వం కనబడింది రమణరావుకు.

కౌముది రోశయ్యను చంపమంది. రోశయ్య కౌముదిని చంపమంటున్నాడు. అసలు వీళ్ళిద్దరికీ మధ్య అసలు కథేమిటి?

"కౌముది మీ మీద ఎందుకు పగబట్టింది?" అన్నాడు రమణరావు. అప్రయత్నంగా అతడి చూపులు రోశయ్య కళ్ళపైనే ఉన్నాయి.

"భగవంతుణ్ణి దర్శించుకోడానికి కొండ ఎక్కాలంటే ఎన్నో మెట్లు ఎక్కాలి. అలా ఎక్కడంలో మన కాళ్ళకింద ఎన్ని చీమలు నలిగాయో లెక్కచూడగలమా? అలాంటి చీమల్లో ఒకటి తనూ కొండఎక్కి మనకు కుట్టాలని వచ్చిందనుకో—దాన్ని చేత్తో నలిపేయడమో కాలితో రాసేయడమో చేస్తాంకానీ ఈ చీమ ఎవరు? ఎందుకు మనని కుట్టడానికింతదూరం వచ్చింది—అని ఆలో

చిస్తూ కూర్చుంటామా? కౌముదిని గురించి ఆలోచించడం నా కిష్టంలేదు. నన్ను కష్టాలని వచ్చిన చీము అది. నేను దాన్ని కాలరాచేస్తాను. అంతే!" అన్నాడు రోశయ్య.

"ఇంతకీ ఇప్పుడు నన్నేం చేయమంటారు?"

"నీకు నేను సాయపడతాను. ఆమె కళ్ళముందు హత్య చేయబడడం కోసం ఆమె కోరిన చోటకు నీతో పాటు నేనూ వస్తాను. ముందు మీరిద్దరూ కలిసి కార్య క్రమాన్ని నిర్ణయించండి. దానికి నేను ఫినిషింగ్ టచ్ ఇస్తాను—"

రమణరావు రోశయ్య దగ్గర సెలవు తీసుకున్నాడు.

# 5

"అంతా మీరు కోరినట్లే జరుగుతుంది. నేను మీ విధేయుణ్ణి!" అన్నాడు రమణరావు.

కౌముది తృప్తిగా తలాడించి— "ఎల్లుండి సాయంత్రం మీరు రోశయ్యను తీసుకుని హోటల్ మీనాక్షికి రండి. అక్కడ రూం నెంబరు పదహార్లో నేను ఉంటున్నాను. ఆ గదిలో నిరాటంకంగా మన కార్యక్రమాన్ని కొనసాగించవచ్చును...." అంది.

"ఒక హోటల్ గదిలోనా? అదెంత ప్రమాదం....?" అన్నాడు రమణరావు.

"ఆ హోటల్ గదులన్నీ సౌండ్ ప్రూఫ్. అక్కడి మాటలు బయటకు వినిపించవు. రోశయ్య కేకలు పెడుతూ చచ్చినా మనకేమీ భయంలేదు...." అంది కౌముది.

రమణరావు అనుమానంగా ఆమెవంక చూసి— "ఒక హత్య గురించి ఇంత తేలికగా మాట్లాడుతున్న మిమ్మల్ని చూస్తూంటే నాకు అనుమానంగా ఉంది. ఈ విషయంలో మీకు బాగా అనుభవమా?" అన్నాడు.

"ఏ అనుభవం మిమ్మల్నిప్పుడు హత్యకు పురిగొల్పిందో చెబితే నాగురించి నేనూ మీకు చెబుతాను—" అంది కౌముది. రమణరావు మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"ఇందులో అనుభవానిదేముంది? సంకల్పబలం అంతే" అందామె.

"రోశయ్యను చంపాక శవాన్నేంచేద్దామని మీ ఉద్దేశ్యం!"

"ఎలాగో అక్కణ్ణించి బైటకు చేరవేసి ఏ నదిలోనో పారేస్తాను...." అంది కౌముది.

"ఇంత చేసినవాణ్ని మిమ్మల్ని మళ్ళీ శ్రమపెట్టలేను. ఆ పనికూడా నేనే చేస్తాను...." అన్నాడు రమణరావు.

"మీవల్ల అవుతుందా?"

"హత్య చేసినవాడికి శవాన్ని మాయం చేయడం ఓ లెక్కా?"

"అలా తేలిగ్గా మాట్లాడకండి. చంపడం తేలికే. శవాన్ని మాయం చేయడమే కష్టం. ఎందరో హంతకులు అది చేతకాకే పట్టుబడిపోయారు" అంది కౌముది.

"మీరు ఆడవారు. నేను మగవాణ్ని. మీకంటే ఈపని నాకే సులభం అనుకుంటున్నాను...." అన్నాడు రమణరావు.

"ఎలా చేద్దామనుకుంటున్నారు?" అంది కౌముది.

"రోశయ్యను స్పృహతప్పించి ఓ ట్రంకుపెట్టిలో వేసుకుని హోటల్ కు వస్తాను. మీ ఎదురుగా ఆయన్ను చంపేక మళ్ళీ ఆ ట్రంకుపెట్టిలోనే రోశయ్య శవాన్ని తీసుకుపోతాను" అన్నాడు రమణరావు.

"ఈజిట్ సో సింపుల్?" అంది కౌముది.

"అద్భుతమైన మీ అందాన్ని స్వంతం చేసుకోవడం

కోసం ఎంత కష్టమైన పనినైనా నేను సింపుల్ గానే భావించక తప్పదు" అన్నాడు రమణరావు.

"ఇంక నేను ఎల్లుండి సాయంత్రం కోసం ఎదురు చూస్తూంటాను....అప్పుడే మనం మళ్ళీ కలుసుకునేది...." అంది కౌముది.

# 6

రమణరావు రోశయ్యకు కత్తి చూపించి "దీంతోనే నేను మిమ్మల్ని హత్య చేయబోతున్నాను" అన్నాడు.

రోశయ్యా దానివంక పరీక్షగా చూశాడు. తర్వాత తన దగ్గరున్న బొమ్మనొకటి తీసి కత్తితో దాన్ని పొడిచాడు.

బొమ్మ రక్తసిక్తమైంది. కత్తిమాత్రం రోశయ్య చేతిలోనే వుండిపోయింది.

"పొడుస్తూవుంటే కత్తి పిడిలోకి వెళ్ళిపోతూంటుంది. పిడిలోంచి రక్తం మనిషి శరీరంపైన ప్రవహిస్తూంటుంది" అని నవ్వాడు రమణరావు.

"ప్రాణంలేని బొమ్మలనుకూడా రక్తపు మడుగులో ముంచగల నీ కత్తికి జోహార్లు" అన్నాడు రోశయ్య.

"జోహార్ల సంగతి అటుంచి నేను జాగ్రత్తగా వుండాలి. గోడకు ఆన్చినా ఈ కత్తిలోంచి రక్తం వస్తుంది" అన్నాడు రమణరావు.

రోశయ్య బొమ్మను పరిశీలిస్తూ "దీంతగలెయ్యా—ఇది నిజం రక్తంలాగానే ఉందయ్యా" అన్నాడు.

"చచ్చినవాళ్ళను తగలెయ్యక ఏం చేస్తాం కానీ అది నిజం రక్తంలా వుండడంలో ఆశ్చర్యమేముంది? విజ్ఞానం అదే పనిగా వృద్ధి చెందుతోంది. మనిషి చంద్రమండలం మీద అడుగుపెట్టాడని అనడం పూర్వకాలపు మాట అని పించుకునే రోజులు వచ్చాయి" అన్నాడు రమణరావు.

"సరే—నీ కార్యక్రమం ప్రారంభించు" అన్నాడు రోశయ్య.

రమణరావు ట్రంకు పెట్టి తెరిచి — "మీరు ఇందులో ప్రవేశించాలి!" అన్నాడు.

"అలాగే కానీ....గుర్తుంచుకో....అక్కడ హోటల్లో నాకేదైనా ప్రమాదం జరిగిందో—నీకూ ప్రమాదమే! ఇంట్లోనూ, దుకాణంలోనూ కూడా రెండుకవర్లిచ్చి వచ్చాను. రేపు మధ్యాహ్నంలోగా నేను రాకపోతే ఆ కవర్లు పోలీస్ స్టేషన్ కు వెడతాయి. నా చావుకు నువ్వే కారణమని అందులో రాశాను" అన్నాడు రోశయ్య.

"ఇది మీకు తగునా?" అన్నాడు రమణరావు.

"నీ కోసం ఇంత సాహసం చేస్తూంటే—నా జాగ్రత్తలో నేనుండడం తప్పా?" అన్నాడు రోశయ్య.

రమణరావు నవ్వి—"మీ జాగ్రత్త ఎంత అనవసరమో మీకు రేపు తెలుస్తుందా?" అన్నాడు.

"అదే నేనూ కోరుకునేది!" అన్నాడు రోశయ్య.

రమణరావు ఒక నైలాన్ తాడుతీసి రోశయ్య కాళ్లూ చేతులూ కట్టేశాడు. తర్వాత ఆయన్ను భుజాన వేసుకుని "అబ్బా—మిమ్మల్ని మోయడం కష్టమే!" అన్నాడు.

"అందుకే టాక్సీలోకాక రిక్షాలో వెళ్ళు. వాడైతే ఓ రూపాయ డబ్బు లెక్కువడిగినా పెట్టె మోస్తాడు" అన్నాడు రోశయ్య.

"మెలకువగా వుంటే పెట్టెలో ఎక్కువ సేపుండలేక కేకలు వేసినా వేయొచ్చు. కాస్త క్లోరోఫాం వాసన చూసి పడుకోండి" అన్నాడు రమణరావు.

"నీ సూచన బాగానే వుంది" అంటూ మెచ్చుకున్నాడు

రోశయ్య.

రమణరావు రోశయ్యకు క్లోరోఫాం వాసన చూపి స్పృహ పోగొట్టాడు. ఆయన్ను నెమ్మదిగా పెట్టెలోకి చేర్చి మూత వేశాడు. మూత వేస్తూ రోశయ్యవంక జాలిగా చూసి "నా కోసం మిమ్మల్ని శ్రమ పెడుతున్నానుగదా!" అనుకున్నాడు.

అతడికి రోశయ్యను ఎక్కువ సేపు ట్రంకులో వుంచడం ఇష్టంలేదు. అందుకని వేగంగా ఓ రిక్షాను పిల్చుకుని వచ్చాడు. పెట్టె చూపించి హోటల్ మీనాక్షికి చేర్చమన్నాడు.

రిక్షావాడు పెట్టెనోసారి కదిపి "చాలా బరువుందండి. దీన్ని నేనే రిక్షాలో వేసి మీ రూందాకా మోసుకు రావాలంటే మొత్తం పది రూపాయలివ్వాలి" అన్నాడు.

"సరే—అలాగే" అన్నాడు రమణరావు.

పదిరూపాయల బేరం రిక్షావాడికి ఎనలేని బలాన్ని తెచ్చిపెట్టింది. వాడొక్కడే ఈడ్చి ఆ పెట్టెను రిక్షాలోకి చేరవేశాడు. రిక్షాను శరవేగంతో హోటల్ కు తీసుకుపోయాడు.

రమణరావునీ, పెట్టెనూ కూడా అక్కడ చాలామంది విచిత్రంగా చూశారు. రమణరావు ఎవర్నీ పట్టించుకోకుండా పదహారో నంబరు గదికి వెళ్ళిపోయి కాలింగ్ బెల్ మ్రోగించాడు.

కౌముది వచ్చి తలుపు తీసింది. రమణరావువంకా, అతడి వెనుకనే వున్న రిక్షావాడి నెత్తిమీద పెట్టె వంకా సంతృప్తిగా చూసిందామె. పెట్టె లోపల పెట్టాక రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేశాడు రమణరావు.

అప్పుడు తలుపులు లోపల్నుంచి గడియవేసి "ట్రంకు

పెట్టి తెరు!" అంది కౌముది.

హఠాత్తుగా మారిన ఆమె సంబోధనకు ఆశ్చర్యపడ్డాడు రమణరావు.

"ఈ క్షణం నుంచీ నిన్నిలాగే పిలుస్తాను. అప్పుడే నిన్ను నా ఆత్మీయుణ్ని చేసుకున్నాను" అంది కౌముది.

"చాలా సంతోషం కౌముదీ!" అంటూ ట్రంకు పెట్టి తెరిచాడు రమణరావు. అందులోకి ఆత్రుతగా చూసింది కౌముది. అప్రయత్నంగా ఆమె పళ్ళు పటపటలాడాయి.

"వాణ్ని బయటకు తీయి. త్వరగా స్పృహ తెప్పించు" అంది కౌముది.

రమణరావు రోశయ్యను పెట్టెలోంచి బయటకు తీసి మంచంమీద పడుకోబెట్టాడు.

కౌముది రోశయ్య వంకే కొద్దిక్షణాలు పరిశీలనగా చూసి ఏదో ఆలోచనలో పడిపోయింది. ఆమె ఆలోచనల్లో వుండగానే రోశయ్యకు స్పృహవచ్చి కళ్ళు తెరిచి- "నేనెక్కడున్నాను?" అంటూ గింజుకోసాగాడు.

"నా ఎదురుగా?" అంది కౌముది అదోలా నవ్వుతూ.

"ఎవర్నువ్వు? నువ్విక్కడికెలా వచ్చావ్?" అన్నాడు రోశయ్య. అతడు తన బంధాలను విడిపించుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాడు.

"నిన్నీ మనిషి నాకోసం తీసుకువచ్చాడు!" అంది కౌముది.

అప్పుడే రోశయ్య రమణరావుని చూశాడు "నీచుడా! ఇదా నువ్వు చేసిన పని! నన్నెందుకిలా బంధించి ఇక్కడికి తీసుకొచ్చావు?" అన్నాడు.

"ఆమె కోరింది. నేను తెచ్చాను. నేనామెకు విధేయుణ్ని!" అన్నాడు రమణరావు.

"ఆమెకు విధేయుడివా—నన్నామె చంపమన్నా చంపుతావా?" అన్నాడు రోశయ్య.

"నేను చంపమనడమూ, అతను చంపడమూ, నువ్వు చావడమూ—అన్నీ తథ్యమే!" అంది కౌముది.

రోశయ్య ఆమెవంక చూసి — "ఎవర్నువ్వు?" అన్నాడు.

"ఇందుమతి కూతుర్ని" అంది కౌముది.

"ఇందుమతి ఎవరు?"

"నీ చేతుల్లో చచ్చిపోయిన మా అమ్మ!" అంది కౌముది.

"నువ్వనేదేమీ నాకు అర్థంకావడం లేదు" అన్నాడు రోశయ్య.

"నీ చేతుల్లో ఎంతమంది అమ్మలు చచ్చిపోయారో—అంతమందిలో ఇందుమతి గుర్తుందనుకోవడం నా తెలివి తక్కువ" అంది కౌముది.

కొండ మెట్లు ఎక్కుతూంటే నలిగే కాలికింది చీమల గురించి రోశయ్య చెప్పడం గుర్తొచ్చింది రమణారావుకి.

"నిజంగా నాకేం తెలియదు" అన్నాడు రోశయ్య.

"తప్పు ఒప్పుకో" అంది కౌముది.

"తప్పు చేయనపుడు ఎలా ఒప్పుకునేది?" అన్నాడు రోశయ్య.

"ఒప్పుకోకపోతే...." అని ఆవేశంగా ఆగింది కౌముది.

"ఊఁ ఒప్పుకోకపోతే...." అన్నాడు రోశయ్య.

"నాకసలే ఆవేశం ఎక్కువ. నేను స్వయంగా నిన్ను క్రూరంగా చంపేస్తాను."

"ఒప్పుకుంటే...."

"ఒప్పుకుంటే నాకాబోయే భర్త చేతిలో నీ మరణం

సంభవిస్తుంది. అతడికి నాకున్న ఆవేశం లేదు కాబట్టి ఒకే ఒక్క కత్తిపోటులో నీ ప్రాణం పోవచ్చు—"

"ఎలాగూ నాకు చావు తప్పదన్నమాట" అన్నాడు రోశయ్య. తర్వాత ఆయన రమణరావు వంక తిరిగి—"నిన్ను నమ్మాను. నాకిలా అన్యాయం చేయడం నీకు న్యాయమా?" అన్నాడు.

"నేను కౌముదికి విధేయుణ్ణి!" అన్నాడు రమణ రావు.

రోశయ్య కళ్ళు మూసుకుని "నిన్ను నమ్మినందుకు నాకు మంచి శాస్తి జరిగింది. ఎలాగూ చచ్చేటప్పుడు సుఖంగా చావడమే మంచిది"—అని—"అమ్మా—కౌముదీ—తప్పు ఒప్పుకుంటున్నాను" అన్నాడు.

"ఒప్పుకుంటే చాలదు. నువ్వు చేసిన పాపం నీ నోటితో వివరంగా చెప్పాలి" అంది కౌముది.

"ఏం—కూడా ఏదైనా టేపురికార్డరు తెచ్చావా?" అన్నాడు రోశయ్య.

కౌముది అదోలా నవ్వి—"నిన్ను జైలుకు పంపడానికి ప్రాణం లేని టేపు రికార్డరెందుకు? ప్రాణాలున్న మీనాక్షులే వున్నారు...." అంది.

రోశయ్య ఉలిక్కిపడి-"మీనాక్షి బ్రతికే వుందా?" అన్నాడు.

"మీనాక్షి ఎవరు?" అన్నాడు రమణరావు ఆశ్చర్యంగా.

"మీనాక్షి ఎవరో నువ్వే రమణరావుకు చెప్పు!" అంది కౌముది.

"అది నా వ్యక్తిగత విషయం. ఎవరికీ చెప్పను—" అన్నాడు రోశయ్య.

"నువ్వు చెప్పక్కర్లేదు. ఆ కథ చెప్పడానికి మీనాక్షి వుంది" అంది కౌముది.

రోశయ్య కంగారుగా రమణరావు వంక చూసి—

"రమణరావ్! ఈమె ప్రమాదకరమైన వ్యక్తి! మీనాక్షి కథ బయటకు వస్తే పునాదులు కదుల్తాయి. మీ నాన్న, నేను కలిసికట్టుగా జైలుకు వెళ్ళాల్సి వస్తుంది. మన ఆస్తులన్నీ ప్రభుత్వం పాలవుతాయి ముందు నా కట్లు విడిపించు" అన్నాడు.

రమణరావు శరీరంలో వణుకు ప్రారంభమైంది.

ఎవరీ కౌముది? ఆమె చెబుతున్న మీనాక్షి ఎవరు? మీనాక్షి కథతో తమ ఆస్తులెలా ముడిపడి వున్నాయి. ఇందులో తన తండ్రి పాత్ర ఏమిటి?

కౌముది రమణరావు వంక చూసి—"క్షణం ఆలశ్యం చేయకు. వాణ్ణి చంపేయ్" అంది.

ఆమె నోటినుంచి ఆ మాట వచ్చిందే తడవుగా రమణరావు తనవద్దనున్న కత్తితో మూడు పోట్లు పొడిచాడు రోశయ్యను. మొదటి పోటుకు రోశయ్య పెద్దగా అరిచాడు. రెండో పోటుకు సన్నగా మూలిగాడు. మూడో పోటుకు మరి మాట్లాడలేదు.

"చచ్చాడు!" అన్నాడు రమణరావు. అతను తన జేబులోంచి రుమాలుతీసి కత్తిని దాంట్లో చుట్టి మళ్ళీ జేబులో వుంచుకొన్నాడు!

"దేశానికి పీడ విరగడైంది. ముందు వీణ్ణిక్కణ్ణుంచి తీసుకుపోయి మళ్ళీరా!" అంది కౌముది.

రమణరావు రోశయ్యను జాగ్రత్తగా ట్రంకులోకి ఎక్కించాడు. తర్వాత ట్రంకు మూసి "మరి నేను వెడతాను. నువ్విక్కడే వుంటావుగా" అన్నాడు.

"ఉంటాను. నీకోసం ఎదురుచూస్తూ!" అంది కౌముది.

రమణరావు బైటకు వెళ్ళాడు. కొద్ది నిముషాల్లో అతను ఓ కూలివాణ్ని తీసుకుని వచ్చాడు. ట్రంకుతోసహా అతను బైటకు వెళ్ళాడు. కౌముది తలుపులు వేసుకొంది.

## 7

సరిగ్గా అరగంటైనా కాకుండా ఎవరో తలుపుతట్టగా వెళ్ళి తీసింది కౌముది.

తలుపు అవతల రమణరావు కనిపించాడు. అప్పుడే అతను శవాన్ని వదిలించుకు రాగలిగినందుకు ఆశ్చర్యపోతూ ఏదో అడగబోయి ఆగిపోయింది ఆమె. రమణరావు హడావుడిగా లోపలకు జొరబడ్డాడు. ట్రంకు నెత్తిమీద పెట్టుకొని వున్న కూలివాడు అలా ఎక్కువసేపు నిలబడలేక తనూ లోపలకు జొరబడ్డాడు.

త్వరగా ఆ ట్రంకు లోనికి దించారు. కూలివాడు వెళ్ళిపోయాడు.

తను తలుపులువేసి "ఏమిటిది?" అని అడిగింది కౌముది.

"ఏ కారణంగానో ఊరంతా పోలీసులు తిరుగుతున్నారు. ఎవరైనా రాజకీయనాయకుడు వచ్చాడో, వస్తాడో ఏమోనని అనుమానంగా వుంది. తెల్లవారేలోగా ఎలాగో అలా ఈ శవాన్ని వదుల్చుకువస్తాను. ఈలోగా నీతో కులాసాగా గడపాలని అనిపించింది...." అన్నాడు రమణరావు.

"అయితే ఈ ట్రంకును మంచం క్రిందకు తోసేద్దాం" అంది కౌముది.

ఇద్దరూ కలిసి కష్టపడి సాయంపట్టి ట్రంకును మంచం క్రిందకు తోసేశారు.

రమణరావు చనువుగా కౌముది భుజంమీద చేయివేసి

దగ్గరగా లాక్కొన్నాడు.

కౌముది అతన్ని వదిలించుకుందుకు ప్రయత్నించలేదు. అతడికి మరింత దగ్గరగా జరిగి—"నా సంగతి నీకు తెలియదు. నా కోసం హత్యకూడా చేసిన నీకు నేను ఏమైనా ఇవ్వగలను. నీలాంటి మగవాణ్ని నేనింతవరకూ చూడలేదు. ఇదివరలో ఒకరిద్దరు నన్ను నమ్మించి మోసంచేశారు. నమ్మించి మోసంచేసిన వాళ్ళను నేనేమైనా చేస్తాను?" అంది.

ఆమె అంత దగ్గరగా వుంటే ఏదోలా వుంది రమణరావుకు. అతడి శరీరం, మనసుకూడా వశం తప్పుతున్నాయి. తడబడుతూ—"అయితే నేను కోరింది నీ దగ్గర్నుంచి నేను తీసుకొంటాను. నువ్వు మాత్రం అభ్యంతర పెట్టకూడదు. సరేనా?" అన్నాడతను.

"సరే!" అందామె నవ్వుతూ.

కౌముది అంత సులభంగా తన వశమవుతుందని రమణరావు అనుకోలేదు. అతను తన అదృష్టానికి పొంగిపోయాడు. తన సరదా తీర్చుకొన్నాడు.

"చూశావా నా గొప్పతనం. మనకింకా వివాహం కాలేదు. అయినా నేను అభ్యంతర పెట్టలేదు" అంది కౌముది.

"మన వివాహం జరిగితే అది నా గొప్పతనమవుతుంది. వివాహానికి ముందు మన ఇద్దరికీ సంపూర్ణావగాహన అవసరం. నీ కథ చెప్పు!" అన్నాడు రమణరావు.

కౌముది అతడికి తన కథ చెప్పింది.

* * *

ఇందుమతి వివాహితురాలని తెలిసికూడా కోటయ్య ఆమెను మోహించాడు. చాటుమాటుగా ప్రయత్నించగా

ఇందుమతి అతణ్ని గట్టిగా హెచ్చరించింది. రోశయ్య వినలేదు. ఇందుమతి భర్తకు చెప్పేకుంది.

ఇందుమతి భర్త పురుషోత్తం-వ్యాపారం చేస్తున్నాడు. ఆయన స్నేహితుడు జగన్నాథం కూడా పెద్దవ్యాపారి. జగన్నాథం వంట్లో ఆరోగ్యం బాగా ఉండక పోవడంవల్ల పురుషోత్తం వాళ్ళకు వ్యవహారాల్లో సాయం చేస్తున్నాడు.

జగన్నాథం దగ్గర ఇద్దరుద్యోగులున్నారు. వాళ్ళు కనకరావు, రోశయ్య. జగన్నాథం అనారోగ్యాన్ని ఆసరాగా చేసుకుని వీళ్ళిద్దరూ గాజెకింద పందికొక్కుల్లా తయారయ్యారు. పురుషోత్తం కారణంగా వీళ్ళబండారం బయటపడే పరిస్థితి ఏర్పడింది. అప్పుడు వాళ్ళో పథకం ఏర్పాటు చేశారు.

రోశయ్య వీలున్నపుడల్లా జగన్నాథాన్ని కలుసుకుని కనకరావు, మీనాక్షిల ప్రవర్తన అనుమానాస్పదంగా ఉన్నదని సూచించేవాడు. కనకరావు పురుషోత్తంతో రోశయ్య, ఇందుమతిల ప్రవర్తనగురించి చెడుగా ఉన్నట్లు సూచించేవాడు. రోశయ్యకూ, కనకరావుకూ విరోధంలేదని తెలియడంవల్ల జగన్నాథం, పురుషోత్తం కూడా వీళ్ళమాటలు నమ్మసాగారు.

కనకరావు మీనాక్షివద్దనూ, రోశయ్య ఇందుమతి వద్దనూ అప్పుడప్పుడు అసభ్యంగా ప్రవర్తించి ఆడవాళ్ళ కోపం హద్దులు దాటినట్లు గుర్తించగానే కాళ్ళమీదపడి తప్పు మన్నించమని వేడుకునేవారు. సహజంగానే ఆ ఆడ వాళ్ళకేం చేయాలో తెలిసేదికాదు.

రోశయ్య ఒక పర్యాయం బాగా హద్దుమీరాక ఇంక ఆగలేక ఇందుమతి భర్తకు ఫిర్యాదుచేసింది. ఆమె ఫిర్యాదు చేసిన క్షణంనుంచీ కూడా రోశయ్య పురుషోత్తం

ముందు ఎంతో పెద్దమనిషిలా వ్యవహరించాడు. పురు షోత్తం రోశయ్యాను ఏమీ అనలేకపోయాడు.

ఒక పర్యాయం సమయంచూసి కనకరావు పురుషోత్తంతో—"ఆడవాళ్ళకు ఓపరాయి మగాడిమీద మోజుందనుకోండి. ఆ మగాడు తననిబ్బంది పెడుతున్నాడని భర్తకు చెబుతుంది. భర్త ఆ పరాయిమగాడితో గొడవపెట్టుకుంటాడు. అంతవరకూ పెద్దమనిషిలా వ్యవహరించే ఆ పరాయి మగాడిదృష్టి ఆ ఆడదానిమీద పడుతుంది. అప్పుడు కథ ప్రారంభమవుతుంది—" అన్నాడు.

పురుషోత్తంకు ఇందుమతిపై అనుమానం ఆరంభమైంది. రోశయ్యగురించి నేరం చెప్పినపుడల్లా అతడామెనే అనుమానించసాగాడు. దాంతో ఇందుమతి రోశయ్య గురించి భర్తకు నేరంచెప్పే అవకాశం కోల్పోయింది. ఇది కనిపెట్టాక రోశయ్య విజృంభించాడు. ఇందుమతి అతన్ని దెబ్బలాడ్డానికి బదులు బ్రతిమాలవలసి వచ్చింది.

అక్కడ జగన్నాథం ఇంట్లో మీనాక్షికీ ఇదే పరిస్థితి ఏర్పడింది.

ఒకరోజు పురుషోత్తం ఊళ్ళోలేడు. రోశయ్య ఇందుమతి ఇంటికి వెళ్ళాడు. ఇందుమతి తన ఆరోగ్యం సరిగ్గా లేదనీ వెళ్ళిపొమ్మనమనీ రోశయ్యను కోరింది. రోశయ్య వినలేదు. "పోనీ—రెండురోజులు పోయాక రా—అప్పటికి నా ఆరోగ్యం కుదుటపడుతుంది" అంది ఇందుమతి.

"అలా కుదరదు" అంటున్నాడు రోశయ్య. అతడి కంఠం అధికారయుతంగా వుంది. ఆమె వేడుకుంటోంది.

ఆ సమయంలో ఇందుమతి భర్త అక్కడకు వచ్చాడు. ఏదో కారణంవల్ల అతడు ప్రయాణం వాయిదా వేసుకుని వెనక్కు వచ్చాడు. ఇంట్లో జరుగుతున్న సంభాషణ

వింటూంటే అతడికి ఇందుమతి రోశయ్యకు చాలా అధికారాన్నిచ్చిం దనిపించింది. ఆ అధికారం తన కారణంగానే రోశయ్యకు లభించిందని అతడికి స్ఫురించలేదు. మన సంప్రదాయం అటువంటిది.

మధ్యలో వారి మధ్యకు వెళ్ళి భార్యను నానా మాటలూ అన్నాడతను. రోశయ్య అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. భార్య చెప్పే ఒక్క మాటకూడా వినలేదతను.

ఆ రాత్రి ఇందుమతి ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయింది. అప్పటికామెకు ఓ పాప. చచ్చేముందు ఆమె భర్తకో ఉత్తరం పెట్టింది. ఆ ఉత్తరంలో రోశయ్య తనెలా వేధించాడో, వేధిస్తున్నాడో రాసిందామె. కానీ పురుషోత్తంకు ఆమెపై ద్వేషం పోలేదు. ఆ వుత్తరానికతడు పెద్దగా విలువనివ్వలేదు.

పురుషోత్తం విరక్తితో ఆ ఊరు వదిలిపెట్టి మరోచోట వ్యాపారం కొనసాగించాడు. కూతుర్ని పెంచి పెద్దదాన్ని చేశాడు. ఒకసారి జరిగిన అనుభవంతో అతడు మళ్ళీ పెళ్ళి జోలికి వెళ్ళలేదు.

వారి జీవితం సాఫీగానే కొనసాగిపోతూండగా రెండు సంవత్సరాల క్రితం పురుషోత్తాన్ని అనుకోకుండా ఒకామె కలుసుకుంది. ఆమె పేరు మీనాక్షి! ఆమె పరిస్థితి చాలా దయనీయంగా వుంది. ఆ ఇంటా ఆ ఇంటా వంట చేసుకుంటూ బ్రతుకుతున్నదామె!

పురుషోత్తం మీనాక్షిని గుర్తించి పలకరించాడు. ఆమె చెప్పిన కథ దయనీయంగా వుంది.

జగన్నాథం రోశయ్య మాటలు విని తన భార్య గురించి నలుగురిలో చెడ్డగా చెప్పేవాడు. తన ఆరోగ్యం

సరిగాలేని ఈ పరిస్థితుల్లో భార్య ఇలా ప్రవర్తించడం తనను మరింత మానసికంగా కృంగదీస్తోందని వాపోయే వాడు. ఇలా కొన్నాళ్ళు జరిగేసరికి ఓరోజు కనకారావు, రోశయ్య తమ అసలు రంగు బయటపెట్టారు.

బలవంతంగా జగన్నాథంచేత ఆస్తి తమ పేరున వ్రాయించుకున్నారు. భార్య ప్రవర్తన సరిగాలేక మనసు చెడి ఆత్మహత్య చేసుకుంటున్నట్లుగా అతడిచేత ఉత్తరం మీద సంతకం పెట్టించుకుని బలవంతంగా అతడిచేత విషం త్రాగించి చంపేశారు.

వాళ్ళ అసలు స్వరూపం బయట పడడంతో జగన్నాథానికి అంతకాలమూ జరిగిన మోసం గ్రహింపయింది. అందుకే ఆస్తి రాసేటప్పుడు సర్వహక్కులూ భార్యకే వుండేటట్లూ వీరిద్దరూ ఆ ఆస్తికి ట్రస్టీలుగా మాత్రమే వుండాలనీ రాశాడతను. అలా రాయడం రోశయ్యకూ, కనకారావుకీ ఇష్టంలేదు. కానీ జగన్నాథం మొండికెత్తడంతో ఒప్పుకోక తప్పలేదు.

జగన్నాథం చావగానే మీనాక్షిని లొంగదీసుకోడానికి ఇద్దరూ ప్రయత్నించారు. మీనాక్షి ఆ దుర్మార్గుల మోసం బయటపెడతాననీ తన జోలికి రాకుంటే ఊరుకుంటాననీ చెప్పింది. మీనాక్షిని కూడా అడ్డు తప్పించి అక్కణ్నించి మకాం ఎత్తేయాలని వారు పథకం వేశారు. జగన్నాథం ఆస్తిని క్యాషురూంలోకి మార్చేశారు. వాళ్ళకు అవసరమైన సంతకాలన్నీ మీనాక్షి పెట్టింది.

ఆ ఊర్నించి మకాం ఎత్తేసేటప్పుడు మీనాక్షి ప్రమాదం పసికట్టి వారి దగ్గర్నుంచి తప్పించుకుని పారిపోయింది. ఆ తర్వాత ఆ ఇంటా ఈ ఇంటా పనిచేసుకుంటూ రహస్యంగా బ్రతకసాగింది. వయసులోవున్న మీనాక్షికి

ఈ ప్రపంచంలో ఒంటరిగా బ్రతకడం మరీ అంత సులభం అనిపించలేదు. కానీ రోశయ్య, కనకారావుల వంటి దుర్మార్గుల బారినుండి బైట పడగలిగింది కాబట్టి ఆమెకు మరీ అంత భయంలేదు.

మీనాక్షి చెప్పిన కథ విని పురుషోత్తం చలించిపోయాడు. తన భార్య ఇందుమతికి ఎంత అన్యాయం చేశాడో గ్రహించి కుమిలిపోయాడు. అతను మీనాక్షికి ఆశ్రయమిచ్చాడు.

అయితే అతనింక ఇంట్లో వుండలేదు. తన ఆస్తిని క్యాషుగా మార్చి, ఫిక్సెడ్ డిపాజిట్లో వేసి—తన కూతుర్ని జాగ్రత్తగా చూడవలసిందిగా మీనాక్షిని కోరి, ఇల్లువదిలి వెళ్ళిపోయాడు.

* * *

"కనకారావు మీ నాన్న అనీ—నేను ఇందుమతి కూతుర్ననీ నేను వేరే చెప్పనవసరం లేదనుకుంటాను—" అంది కౌముది.

రమణరావు ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తూ "అయితే నీకు నామీద కూడా పగ వుండి వుండాలి" అన్నాడు.

"నీమీద నాకు పగెందుకు? తండ్రి చేసిన తప్పు తనయుడికెందుకు అంటగట్టాలి? అందులోనూ నా కోరికమీద నువ్వు రోశయ్యను చంపి హంతకుడివైనావు. నీమీద నాకు ప్రేమ తప్ప మరో భావం లేదు" అంటూ అతడి చుట్టూ చేతులు వేసింది కౌముది.

"కానీ ఎంతో ప్రమాదకరమైన మీనాక్షి నీ దగ్గర వుంది. ఆమె నా తండ్రికి ప్రమాదం. అవునా?"

కౌముది నవ్వి—"ఇప్పుడేం చేయగలదు మీనాక్షి?

ఇన్నేళ్ళ జీవితానుభవంలో ఆమె పగ ఎప్పుడో చచ్చి పోయింది. నా దగ్గర ఆమెకిప్పుడు జీవితం ఎంతో బాగుంది. పోగొట్టుకున్న వైభవం నా కారణంగా ఆమె కిప్పుడు మళ్ళీ లభించింది. రెండు సంవత్సరాలుగా నాతో వుంటూ నామీద మమకారం పెంచుకుంది. ఇప్పుడామెకు ఇంకే కోరికలూ లేవు. పాత పగలు—మొదలే లేవు" అంది.

రమణరావు సాలోచనగా తల పంకించి—"మీ రిప్పు డెక్కడుంటున్నారు?" అనడిగాడు.

"ఆ వివరాలన్నీ తర్వాత చెబుతాను. మీ నాక్షి ద్వారా మా అమ్మ కథ విన్నప్పట్నుంచీ నా హృదయం రోశయ్య మీది పగతో పట్టుతప్పింది. వాడు చనిపోయిన సందర్భం కావడం వల్లనే నేను నిన్ను నాకింత దగ్గరగా రానిచ్చాను. ఈ క్షణాలు మనం సరదాగా గడుపుదాము. మరో ఆలోచన వద్దు" అంది కౌముది.

ఆమె ప్రోత్సహిస్తూంటే రమణరావు ఆమెను బిగి కౌగిలిలో బంధించాడు.

# 8

ఓ రాత్రివేళ కళ్ళు తెరిచి చూసింది కౌముది. ఆమెకు పక్కలో రమణరావు కనిపించలేదు. ఏమయ్యాడు చెప్మా అనుకుంటూ మంచానాన్నానుకునే వున్న స్విచ్ నొక్కింది.

గదంతా ప్రకాశవంతమైంది.

కౌముది వళ్ళు విరుచుకుంటూ లేచి బాత్రూంకి వెళ్ళింది. అతడు అక్కడ లేడు. ఆమె తర్వాత గదితలుపు దగ్గరకు వెళ్ళింది. తలుపు దగ్గరగా వేసి వుంది.

'ఎందుకో బైటకు వెళ్ళి వుంటాడు. అయినా చెప్ప కుండా వెళ్ళిపోయాడేమిటి?' అనుకొంటూ తలుపు బోల్టు వేసింది కౌముది. ఆమె తిరిగి మంచాన్ని సమీపిస్తూంటే

దాని క్రింద వున్న పెట్టె అప్రయత్నంగా ఆమె కళ్ళ బడింది. అందులో రోశయ్య శవం వున్నదన్న విషయం హఠాత్తుగా ఆమెకు గుర్తొచ్చింది.

ఆ హోటల్ గదిలో ఒంటరిగా తను! తనకు తోడుగా ట్రంకులోని ఓ శవం.

రమణరావు ఏమయ్యాడు?

అలా నిలబడి ఆలోచిస్తూన్న ఆమె కళ్ళకు ట్రంకు మూత పైకి లేస్తున్నట్లు కనబడింది. అనుకోకుండా ఆమె కాళ్ళు వణికాయి.

పెట్టెమూత ఎలా కదుల్తోంది?

ఒకవేళ రోశయ్య ఇంకా పూర్తిగా చావలేదా? కొన ప్రాణంతో బయటకు రావడానికి ప్రయత్నిస్తున్నాడా?

పెట్టెమూత కొంచెం మాత్రం పైకిలేచి మంచానికి తగులుకొని మళ్ళీ పడిపోతోంది.

కౌముది నిశ్చేష్టురాలై ఆ దృశ్యాన్ని చూస్తూ వుండి పోయింది. తను భ్రమపడడం లేదు.... మూత మంచానికి తగులుతున్న చప్పుడు కూడా వినబడుతోంది. పెట్టెలోని శవం కదుల్తోంది. కారణం ఏమిటి?

స్వతహాగా కౌముది ధైర్యవంతురాలు. కానీ ఇప్పు డామె ధైర్యం నీళ్ళుగారి పోతోంది.

కౌముది చూస్తూండగానే పెట్టెమూత కొద్దిగా తెరుచు కొని మంచానికి తగిలి అలాగే ఆగింది. ఆ కాస్త ఖాళీ లోంచీ ఓ చేయి బైటకు వచ్చింది. ఆ చేతిని చూస్తూనే కౌముది అప్రయత్నంగా కెవ్వుమని అరిచింది.

సుమారు మోచేతిదాకా బయటకు వచ్చిన ఆ చేయి ఎంతో నల్లగా వుంది. మణికట్టు వరకూ దట్టంగా వున్న నల్లటి వెంట్రుకలు....

రోశయ్య చేయి అలా లేదు!....ఇది రోశయ్య చెయ్యి కాదు.

కౌముది అలా చూస్తూ నిలబడింది. ఆ చేయి కాసేపు వృధా ప్రయత్నంచేసి మళ్ళీ పెట్టెలోనికి వెళ్ళింది. పెట్టె మూత పడిపోయింది. కౌముది వెంటనే గదిలోంచి బైటకు వెళ్ళింది. బయటనుంచి తలుపు వేసింది. వరండాలో ఒక మూల టెలిఫోన్ వుంది. అక్కడకు వెళ్ళి ఓ నంబరుకు టెలిఫోన్ చేసింది.

"సత్యానంద్ ...." అందామె.

"కౌముదీ....నువ్వా?" అందవతలి కంఠం.

"అర్జంటుగా బయల్దేరి నా గదికి వస్తావా?" అనడిగింది కౌముది.

"అయిదు నిముషాల్లో అక్కడ వుంటాను...." ఫోన్ క్లిక్ మంది.

అయిదు నిముషాలపాటు కౌముది వరండాలోనే పచార్లు చేసింది.

రమణరావు ఏమయ్యాడు? పెట్టెలోని రోశయ్య శవానికా భయంకరమైన చేయి ఎలా వచ్చింది?....వగైరా ఆలోచనలామెను విపరీతంగా కలవరపరుస్తున్నాయి. ఎంత ఆలోచించినా సమాధానం దొరకడంలేదు.

సరిగ్గా అయిదు నిముషాల్లో ఆక్కడికి హోటల్ బాయ్ ఒకడు వచ్చాడు.—"ఎవరో సత్యానంద్ అట.. మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాడు. మీ రూంకి ఫోన్ చేస్తే ఎవ్వరూ తీయడంలేదు. అందుకని నేనే వచ్చాను కనుక్కొందుకు...."

"అర్జంటుగా అతన్ని పంపించు" అంది కౌముది.

మరో నిముషంలో సత్యానంద్ ఆమె ముందున్నాడు.

కండలు తిరిగిన ఆ వస్తాదు వంక తృప్తిగా చూస్తూ—"నీ అవసరం వస్తుందని నేననుకోలేదు. కానీ వచ్చినట్లుంది. గదిలోకి పద!" అంది కౌముది.

ఇద్దరూ గదిలోకి వెళ్ళాక తలుపులు వేసింది కౌముది. తర్వాత భయపడుతూనే మంచం క్రింద ట్రంకును చూపించింది. సత్యానంద్ దానివంక చూశాడు.

ఆ ట్రంకు కొద్దిగా హడావుడి చేస్తోంది. బలిష్టుడైన సత్యానంద్ కూడా ఆ దృశ్యం చూసి చలించాడు.

"ఏముంది ఆ ట్రంకులో?"

"ఏమో—నువ్వే చూడు...."

సత్యానంద్ ట్రంకును మంచంక్రిందనుంచి బైటకు లాగాడు. వెంటనే మెరుపు వేగంతో ట్రంకు తెరుచుకొని ఓ నల్లటి మనిషి బైటకు ఉరికాడు.

"ఎంత భయంకరంగా వున్నాడో...." అనుకొంది కౌముది అతణ్ని చూస్తూ.

"రమణారావుకు బుద్ధిలేదు. నేనున్న పెట్టెని మంచం క్రిందకు తోసి తన అవసరం తీర్చుకొన్నాడు. మళ్ళీ బైటకు లాగాలన్న జ్ఞానం లేకపోయింది...." అన్నాడా వ్యక్తి లేచి నిలబడుతూ.

"ఎవర్నువ్వు?" అన్నాడు సత్యానంద్ తనూ అతనికెదురుగా నిలబడి.

"నా పేరు పట్టయ్య...." అన్నాడా నల్లటి వ్యక్తి.

"ఎందుకొచ్చావిక్కడికి?"

"కోశయ్య పంపాడు—ఆ అమ్మాయిని చంపమని."

"మరి చంపుతావా?" అన్నాడు సత్యానంద్ తన చేతుల్ని పదును పెడుతూ.

పట్టయ్య పరీక్షగా పదునౌతూన్న సత్యానంద్ చేతుల్ని,

కండలు తిరిగిన అతడి దేహాన్ని చూస్తూ—"డబ్బిచ్చు కున్నాగా మరి చంపక తప్పుతుందా?" అన్నాడు.

అతడి మాటలు పూర్తి కాకుండానే సత్యానంద్ హఠాత్తుగా అతడి కడుపులో గుద్దాడు. మెలికలు తిరుగుతూ పడిపోయాడు పట్టయ్య. అదే అవకాశంగా తీసుకుని సత్యానంద్ పట్టయ్య మీదకురికి కీలకస్థానాల్లో గబగబా నాలుగు దెబ్బలు వేశాడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు పట్టయ్య నీరసంగా.

"నా పేరు సత్యానంద్ ...."

"ఎవరు రప్పించారు నిన్ను ....?"

"కౌముదిపై ఎవరైనా చేయి వేయాలనుకొంటే ప్రత్యక్షమవుతూంటాను నేను. ఆమెను చంపాలన్న పాడు ఆలోచన పోయేదాకా నీ ఒళ్ళు హూనం చేస్తూనే వుంటాను...." అన్నాడతను మరి నాలుగు గుద్దులు గుద్దుతూ.

"నాలో ఇప్పుడే పాడు ఆలోచనలూ లేవు...." అన్నాడు పట్టయ్య.

"నీకు అక్షరాలు రాయడం, చదవడం వచ్చా?" అన్నాడు సత్యానంద్.

"వచ్చు" అన్నాడు పట్టయ్య.

రోశయ్య పంపగా తను కౌముదిని చంపడానికి వచ్చినట్లూ, ఆ ప్రయత్నం సత్యానంద్ కారణంగా విఫలమైనట్టూ వాఙ్మూలం రాయించి సంతకం పెట్టించాడు సత్యానంద్ పట్టయ్యచేత. బ్రతుకుజీవుడా అని బయటకు పోబోతున్న పట్టయ్యతో—"ఇంకో రెండు రోజులవరకూ నువ్వు రోశయ్యనుకానీ, రమణరావునికానీ చూడ్డానికి వీల్లేదు...." అన్నాడు సత్యానంద్.

"అలాగే!" అన్నాడు పట్టయ్య.

"ఇదిగో.... ఈ ట్రంకు కూడా తీసుకునిపో—" అంది కౌముది.

పట్టయ్య ట్రంకు నెత్తిన పెట్టుకుని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాక—"నువ్వు చాలా సాహసం చేశావు. అదృష్టం నిన్ను కాపాడింది. ఎందుకిలా సుఖాన వున్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకుంటావు" అన్నాడు సత్యానంద్.

"నీకు తెలియదు సత్యానంద్! స్వల్ప పరిచయంలో ఆప్తమిత్రుడివై నాకు సాయం చేయడానికి నువ్వొచ్చావు. అంతా నీలాంటి వాళ్ళనని నమ్మి మోసపోతూంటాను నేను. రమణరావును నేను నిజంగా నమ్మాను. ఎంతగా నమ్మానో నీకు తెలియదు. అతడు రోశయ్యను నిజంగానే చంపాడనుకొని ఆ సందర్భాన్న అతడితో కలిసి సెలబ్రేట్ చేసుకొన్నాను. ఇంతకింతా అనుభవిస్తాడు ఆ రమణరావు!" అంది కౌముది.

"పట్టయ్య నిన్ను చంపడానికి వచ్చాడనుకోను. మీనాక్షి గురించి నీచేత వివరాలు చెప్పడంకోసం వచ్చి వుంటాడు...." అన్నాడు సత్యానంద్. అలా అంటూంటే సత్యానంద్‌లో ఆవేశం కట్టలు తెంచుకుంది—"ఎందుకు కౌముదీ — అనవసరంగా నీ జీవితాన్నిలా వృధాచేసు కుంటావు? నిన్ను వివాహమాడ్డానికి నేను సిద్ధంగా వున్నాను. నీ గత చరిత్రతో నాకు సంబంధంలేదు. నీకోసం నువ్వు కోరే ఆ రోశయ్య హత్య నేను చేస్తాను"

కౌముది దిగులుగా నవ్వి — "మచ్చలేని జీవితం నీది. నిన్ను హత్యకు పురికొల్పలేను. అందుకే నేను నా కార్య సాధనకు మోసగాళ్ళ సంతతినే ఎన్నుకుంటున్నాను. అయితే ఇంతవరకూ ఇద్దరు నన్ను మోసగించారు. ఈ

రోజుతో నన్ను మోసగించింది ముగ్గురయ్యారు. రోశయ్య కంటే ముందు రమణరావు మీద ఇప్పుడు నా పగ!" అంది.

# 9

కాలింగ్ బెల్ విని బద్ధకంగా నిద్ర లేచాడు రమణరావు. అతని తండ్రి అతడికోసం ప్రత్యేకంగా కొనిచ్చిన చిన్న ఇల్లు అది. అందులో ప్రస్తుతానికి అతనొక్కడే వుంటున్నాడు.

రమణరావు లేచి తలుపుతీసి ఉలిక్కిపడి—"నువ్వా?"

"ఏం — ఆశ్చర్యంగా వుందా?" అంది కౌముది నవ్వుతూ.

"నేనిక్కడుంటానని నీకెలా తెలుసు?" అన్నాడు రమణరావు.

"నీగురించి నాకు చాలా తెలుసు. నువ్వూ రోశయ్యా కలిసి నన్ను చంపడానికి పట్టయ్యను నియమించారని కూడా తెలుసు" అంది కౌముది.

"నువ్వు....మరి....పట్టయ్య బారినుంచి ఎలా తప్పించుకున్నావ్?" అన్నాడు రమణరావు—ఇంకెలాగూ దాచి ప్రయోజనం లేదని అతను తన అసలు రంగు నావిధంగా బయట పెట్టాడు.

"చాలా సింపుల్ .... నాకు అందం వుంది. వయసుంది. వాడు మగాడు. ఎదిరించడానికి బదులు ప్రేమించాను. వాణ్ని నేను పెళ్ళి చేసుకుందుకు సిద్ధపడ్డాను. ఇప్పుడు వాడు నిన్నూ,రోశయ్యనూ కూడా నాకోసం చంపడానికి సిద్ధంగా వున్నాడు...."

"నువ్వు....నువ్వు....పట్టయ్యతో ....ఛీ!" అన్నాడు రమణరావు.

"ఏం చేయను? నువ్వు నన్ను పట్టయ్యకు వదిలి

పోయావు....” అంది కౌముది.

“ఇప్పుడు నువ్వు నా దగ్గర కెందు కొచ్చావ్?”

కౌముది తలుపులు వేసింది—“చెప్పనా?” అంది.

“చెప్పు!” అన్నాడు అతను.

అతనివంక ఆమె ప్రేమగా నవ్వింది— “నేను నిన్ను నమ్మాను. నువ్వు నిజంగానే రోశయ్యను చంపావనుకొని నీకు నా శరీరాన్నిచ్చాను. కానీ నువ్వు నన్ను పూర్తిగా మోసం చేయడమేకాక నన్ను చంపాలనుకున్నావు. ఒక నరరూప రాక్షసుణ్ని నామీదకు ఉసికొల్పావు. ఇప్పుడు నేనేం చేయాలో నువ్వే చెప్పు!”

ఆమె కళ్ళలో కనిపించే ప్రేమకు ఆశ్చర్యపడుతూ— “ఆడవాళ్ళకు తెలిసింది ప్రేమ ఒక్కటే! మంచిచేసినా, చెడుచేసినా మగవాణ్ని ప్రేమించాలి, ఆరాధించాలి! అదే ఆడదాని కర్తవ్యం. మరోసారిలా కౌగిలిలోకి రావలసిందిగా నిన్ను ఆహ్వానిస్తున్నాను” అన్నాడు.

కౌముది నవ్వింది. ఆమె కళ్ళలోని ప్రేమ కాస్త మాయమైంది—“మా అమ్మ చావుకు రోశయ్య ఎంత కారణమో, నీ తండ్రి కనకారావూ అంతే కారణం. నా పగ వీళ్ళిద్దరిమీదా వుంది. ఇప్పుడు తండ్రిమీద పగ తీర్చుకునేందుకు కొత్త ఉపాయం స్ఫురించింది.”

“ఏమిటది?”

“దుర్మార్గంలో నువ్వు నీ తండ్రికి తీసిపోవు. వయసు మళ్ళిన నీ తండ్రిని చంపడంకంటే నిన్ను చంపితేనే మంచిది. ఈ ప్రపంచానికి ఓ దుర్మార్గుడి బాధ వదుల్తుంది. నీ తండ్రి జీవితాంతం కుళ్ళి కుళ్ళి ఏడుస్తాడు....” అంది కౌముది.

“నన్ను నువ్వు చంపుతావా—ఎలా?” అన్నాడు

అతను తేలికగా నవ్వేస్తూ.

"ఇలా?" అంది కౌముది. ఆమె చేతిలో రివాల్వర్ అప్పుడే తళుక్కుమంది. మాట్లాడుదామని నోరు తెరిచే లోగానే ఏదో ఒక సన్నని సూదివంటి వస్తువు అతనికి గుచ్చుకుంది. మనిషి నిలువునా కుప్పలా కూలిపోయాడు.

# 10

"మీనాక్షమ్మగారూ — వచ్చి చూస్తారా?" అంది కౌముది.

"ఏంటమ్మా!" అంది మీనాక్షి.

"మిమ్మల్ని వంచించిన కనకారావు కొడుకును...." అంది కౌముది.

"వాడు నీ చేతుల్లో ఎప్పుడో పోయాడుగా...." అంది మీనాక్షి.

కౌముది మీనాక్షిని చేయి పట్టుకొని ఓ గదిలోకి తీసుకు వెళ్ళి ఓ బీరువా తలుపు తెరిచి చూపించింది. అందులోని అస్థిపంజరాన్ని చూసి ఉలిక్కిపడింది మీనాక్షి.

"ఇతడే కనకారావు కొడుకు....రమణరావు" అంది కౌముది.

"ఏమిటమ్మా—ఇది!" అంది మీనాక్షి కంగారుగా.

కౌముది అక్కడున్న మరో రెండు బీరువాలు చూపించింది. వాటిలో కూడా అస్థిపంజరాలున్నాయి.

"నేను రోశయ్యను చంపాలనుకొన్నాను. ఆ కార్య సాధనకు కాబోయే నా భర్తను ఎన్నుకొన్నాను. రోశయ్యను చంపడమన్నది నేను నిర్ణయించిన వరపరీక్ష. ఇందులో దెబ్బతిన్నా, మోసం చేసినా ఆ మనిషిని చంపడంతో నా సరదా తీరదు. వాడి శవాన్ని అస్థిపంజరంగా మార్చి ఈ గదిలో బీరువాలో అలంకరిస్తే తప్ప నా కసి

తీరదు...." అంది కౌముది.

మీనాక్షి ఆమెవంక ఆశ్చర్యంగా చూసింది. ఈమె వగపరీక్షలో ఎప్పటికైనా వరుడు ఎన్నికవుతాడా?

*　　　*　　　*

"మీ పేరు నాకు తెలియదు. వారం రోజులుగా మిమ్మల్ని చూస్తున్నాను కానీ మాట్లాడ్డానికి ధైర్యం చేయలేకపోయాను. ఈ రోజు అన్నింటికీ తెగించాను. మీ కులం, గోత్రం వగైరాలతో నాకు నిమిత్తంలేదు. మీరు అంగీకరిస్తే నేను వెంటనే రిజిస్ట్రారు ఆఫీసుకి తీసుకెళ్ళి మిమ్మల్ని పెళ్ళి చేసుకొంటాను" అన్నాడా యువకుడు.

కౌముది అతడివంక పరీక్షగా చూసింది. ఓసారి నవ్వింది.

ఇద్దరూ పార్కులో కూర్చుని వున్నారు. అతను కౌముదివంకే ఆత్రుతగా చూస్తున్నాడు.

"మీ నిర్ణయం బాగానే వుంది. కానీ మనం ఏ నిర్ణయమైనా తీసుకొనే ముందు భవిష్యత్తులోకి తొంగిచూడాలి కదా!" అంది కౌముది.

"అన్నీ ఆలోచించే నేనీ నిర్ణయానికి వచ్చాను—" అన్నాడతను.

"భవిష్యత్తులోకి చూస్తూంటే నాకేం కనబడుతోందో తెలుసా?....మీ స్థానంలో ఓ అస్థిపంజరం కనబడుతోంది" అంది కౌముది.

"అంటే?"

"అంటేనా.... రేపు చెబుతాను...." అంది కౌముది.

"రేపు మళ్ళీ నాకోసం ఇక్కడకు వస్తారా?" ఆశగా అడిగాడతను.

"తప్పకుండా...." అందామె.

*　　　*　　　*

"సత్యానంద్ .... నాకు మరో బీరువా బేరం చేసి వుంచు...." అంది కౌముది.

"ఏం—మళ్ళీ ఏదైనా కొత్త బేరం తగిలిందా...." అన్నాడు సత్యానంద్.

"అవును. మనిషి చూడ్డానికి అమాయకుడి లాగే వున్నాడు. కానీ రమణరావు విషయంలోనూ అలాగే అను కొని మోసపోయాను నేను—" అంది కౌముది.

సత్యానంద్ కౌముదిని తన ఇంటికి తీసుకు వెళ్ళి-"నీకో సర్ప్రయిజ్ చూపించనా?" అన్నాడు.

"ఏమిటది?"

సత్యానంద్ కౌముదిని ఓ గదిలోకి తీసుకు వెళ్ళాడు. ఆ గదిలోకి తొంగి చూసి నిశ్చేష్టురాలైంది కౌముది.

అక్కడ మంచంమీద వుంది ఓ శవం.అది రోశయ్యది!

"ఆఖరికి నువ్వు...." అని మాటరాకుండా ఆగిపోయింది కౌముది.

సత్యానంద్ నెమ్మదిగా అన్నాడు — "నీ పగ రోశయ్యమీద....ఆ పగతో ఇప్పటికి ముగ్గురు యువకుల్ని అస్థిపంజరాలుగా మార్చావు. ఈ ప్రపంచంలో నూటికి నూరుపాళ్ళా నీతిమంతులెక్కడున్నారు? నువ్వు నీ వర పరీక్షను నమ్ముకుంటే నీ గదందా అస్థిపంజరాలతో నిండి పోతుంది. క్రమంగా నువ్వో నరరూప రాక్షసివౌతావు. అలా జరగడం నా కిష్టంలేదు. అందుకే నేను హంతకుణ్ణ య్యాను. ఇకనుంచైనా నువ్వు నీ బుర్రలోంచి హత్యల గురించిన ఆలోచనలు తొలగించి నీ భావిజీవితం గురించి ఆలోచించగలవని ఆశిస్తున్నాను...."

అవాక్కై అతడివంక చూస్తూ వుండిపోయింది కౌముది.

* * *

అతను పార్క్‌లో ఆమెకోసం ఎదురుచూసి ఎదురు చూసి విసిగిపోయాడు.

ఆమె రాలేదు.

"ఏమైందామెకు?"....ఇదే ఆలోచన అతడి మదిలో వేధిస్తోంది.

అతడు చుట్టూ చూశాడు. కాస్త దూరంలో ఓ రోడ్డు పైడు హస్త సాముద్రికుడు వున్నాడు.

కాలక్షేపార్థం అతను వెళ్ళి హస్త సాముద్రికునికి చేయి చూపించాడు. సాముద్రికుడు అతడి చేయి పరీక్షగా చూసి—"చాలా అదృష్టవంతుడివి—కొద్ది సేపటి క్రితమే నీకు చాలా ప్రమాదం తప్పింది" అన్నాడు.

అతడికే కాదు. అందానికి భ్రమపడే ఎందరో యువకులకు కొద్ది సేపటి క్రితం ప్రమాదం తప్పింది.

ఇప్పుడు కౌముది గదిలో నాల్గవ బీరువా నలంకరించడానికి తయారవుతున్నది. ఆఖరి అస్థిపంజరం—అదే రోశయ్య అస్థిపంజరం.

—:ఐపోయింది:—

# మంత్రగాళ్ళ మరణం

## వాణిశ్రీ

మల్లయ్యకి మెలకువ వచ్చింది. కడుపు వుబ్బిపోతున్నది. లఘుశంక తీర్చుకోవాలి. ముక్కుతూ మూలుగుతూ లేచాడు. మల్లయ్యకి రెండు రోజుల నుంచి వంట్లో బాగో లేదు.

అదొక పాడుబడిన సత్రం. ఏ నాటిదో? శిథిలావస్థలో వుంది. అందులో ఒక గది, విశాలమైన హాలు వున్నాయి. ఆ గదిని మాత్రం మల్లయ్య స్వంతం చేసుకున్నాడు. హాల్లో చాలామంది తల దాచుకుంటూ వుంటారు. అంతా అనాథలే. భిక్షాటన వారి వృత్తి.

ఆ సత్రం కాంచీ నగరానికీ, రాజాపాలెం పల్లెకూ మధ్యలో వుంటుంది. పూర్వకాలం ఎవరో దాత సత్రం కట్టించి, బావి త్రవ్వించాడు బాటసారులకోసం.

మల్లయ్య నీరసంగా అడుగులు వేస్తూ సత్రం బైట కొచ్చి లఘుశంక తీర్చుకున్నాడు. కడుపులో నొప్పిగా వున్నట్లనిపించింది.

అక్కడికి దగ్గర్లోనే చిన్న నీటిమడుగు వుంది. దట్టంగా పెరిగిన తుమ్మచెట్లు వున్నాయి చుట్టూ. మల్లయ్య ముక్కుతూ మూలుగుతూ బయల్దేరాడు.

టైమెంతయిందో తెలియడంలేదు. చలిగాలి రివ్వున వీస్తోంది. మంచు దట్టంగా కురుస్తోంది. సగం చంద్రుడు నీరసంగా పశ్చిమ దిక్కుకు క్రుంగిపోతున్నాడు. వెన్నెల మంచు తెరలను చీల్చడానికి అవసపడుతోంది.

మల్లయ్య వణుక్కుంటూ నీటిమడుగు దగ్గరికి చేరుకున్నాడు.

తలెత్తి చూసి కెవ్వుమన్నాడు.

అక్కడ రెండు శవాలు పడివున్నాయి.

మల్లయ్య భయంతో వణికిపోయాడు. నిద్రమత్తు వదిలిపోయింది. అంత చలిలోనూ చెమట్లు పట్టాయి. గుండె వెయ్యిమైళ్ళ స్పీడుతో కొట్టుకుంటోంది. కడుపు నొప్పి ఎటు పారిపోయిందో? వంట్లో నీరసం మాయమైపోయింది. ఎక్కడలేని శక్తి వచ్చింది. వెనక్కి చూడకుండా ఒకటే పరుగు.

సత్రంలోకి వెళ్ళాడు.

నిద్ర పట్టలేదు.

తూర్పున వేగుచుక్క పొడిచింది.

మల్లయ్య కొందర్ని లేపి శవాలు చూసిన సంగతి చెప్పాడు.

తెల్లవారేసరికి అంతా నిద్రలేచారు.

నీళ్ళమడుగు దగ్గర శవాలు వున్న సంగతి అందరికీ తెలిసిపోయింది.

జట్లు జట్లుగా వెళ్ళిచూసి రాసాగారు.

గోపయ్య అనేవాడు ఆ శవాలు ఎవరివో గుర్తుపట్టాడు.

"ఆళ్ళిద్దరూ అయ్యా కొడుకులే" అన్నాడు గోపయ్య.

"ఎవరు?"

"ఆడు మంత్రగాడు."

"ఏం పేరు?"

"తాతాచారి."

మల్లయ్య ఆశ్చర్యపోయాడు.

తాతాచారి అతనికి తెలుసు. రాజుపాలెంలోనే వుంటాడు. ఆ చుట్టుప్రక్కల వూళ్ళలో తాతాచారికి మంచి పేరుంది గొప్ప మంత్రగాడని. అతని కొడుకు గూడా మంత్రం వేస్తాడు. పాము మంత్రం, తేలు మంత్రం, దడుచుకున్న వారికి విభూది ఇవ్వడమేగాక దెయ్యంపట్టిన వాళ్ళకి బాగు చెయ్యడం అన్నీ చేసేవాళ్ళు.

సిటీ బస్సు రాజుపాలెం నుంచి టౌన్‌కి వెళ్తుంటే మల్లయ్య బస్సు ఆపాడు.

"తొందరగా ఎక్కు" క్లీనరు కుర్రాడు కేకపెట్టాడు.

మల్లయ్య బస్సు ఎక్కలేదు. డ్రైవర్ దగ్గరికి వెళ్ళి "మీ వూరు మంత్రగాడిని, ఆడి కొడుకునీ చంపి పారేశారు" అన్నాడు.

ఇంజన్ మోతలో మల్లయ్య చెప్పే మాటలు సరిగ్గా వినపడలేదు డ్రైవర్‌కి. ఇంజన్ ఆపి "ఎవర్ని?" అన్నాడు.

మల్లయ్య మళ్ళీ చెప్పాడు.

డ్రైవర్ వెనక్కి తిరిగి ఆ సంగతి కండక్టర్‌కి చెప్పాడు. బస్సులో కూర్చున్న వాళ్ళందరికీ ఆ సంగతి తెలిసిపోయింది.

"ఎక్కడ?" అంటూ ప్రయాణీకులు బస్సు దిగారు.

మల్లయ్య వాళ్ళని వెంటబెట్టుకుని తీసుకెళ్ళాడు.

బస్సులో ప్రయాణీకులంతా రాజుపాలెం వాళ్ళే.

పాలు, పెరుగు, కూరగాయలు టౌన్‌కి తీసుకెళ్ళి అమ్ముకుని వస్తారు. ఆ బస్సులో వెళ్తే మార్కెట్‌కి సమయానికి తీసుకెళ్తుంది.

అక్కడ ఎక్కువసేపు వుండటానికి వీల్లేక పోయింది. అవతల మార్కెట్‌కి సరుకు తీసుకెళ్ళకపోతే అంతా నష్టమే. అందుకే డ్రైవర్ని తొందర చేశారు.

బస్సు బయల్దేరింది. బస్సులో జనం అంతా తాతాచారి మరణం గురించే మాట్లాడుకుంటున్నారు.

డ్రైవర్ బస్సు పోలీస్ స్టేషన్ ముందు ఆపాడు.

అక్కడ సెంట్రీ తప్ప ఎవరూ లేరు.

తాతాచారి హత్య సంగతి చెప్పి వెళ్ళిపోయాడు డ్రైవర్.

## 2

ఇనస్పెక్టర్ రమేష్ హత్య జరిగిన ప్రదేశానికి వెళ్ళే సరికి జనం గుంపుగా చేరి చూస్తున్నారు శవాల్ని.

ఇనస్పెక్టర్ని చూసి గ్రామాధికార్లు విష్ చేసి పరిచయం చేసుకున్నారు.

ఆ శవాలకు దగ్గర్లోనే ఒక ఆడమనిషి కూర్చొని ఏడుస్తూ వుంది.

పోలీసులు జనాన్ని దూరంగా నిల్చోబెట్టారు.

"ఎవరు ఆమె?"

"వుపేంద్రాచారి భార్య" అన్నాడు మునసబు.

తల వూపాడు ఇనస్పెక్టర్.

శవాల్ని పరిశీలనగా చూశాడు. జుట్టు మెడలవరకూ పెంచుకుని నల్లగా వున్న తాతాచారి గుండెల్లో, మెడ మీద కత్తిపోట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అతని

కొడుక్కి వీపు మీద కంఠం దగ్గర గాయాలు వున్నాయి. రక్తంతో బట్టలు అట్టకట్టుకు పోయాయి.

"మునసబు గారూ ఈ తాతాచారి మీకు బాగా తెలుసా?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

"అయ్యో తెలియక పోవడం ఏమిటి ఇన్ స్పెక్టర్ గారూ! మా ఊళ్ళో నాలుగేళ్ళబట్టీ వుంటున్నారు" అన్నాడు మునసబు.

"నాలుగేళ్ళ బట్టీ వుంటున్నాడా?"

"అవును."

"అంతకుముందు ఎక్కడ వుండేవాడు?"

"అతనిది ఈ ప్రాంతం కాదు. ఎక్కడో కృష్ణా జిల్లాలో ఏదో వూరని చెప్పాడు."

"అయితే అతను మీ వూరు వచ్చి నాలుగేళ్ళయింది అంతేగా?"

"అవును."

"మీ వూళ్ళో అతనికి ఎవరైనా చుట్టాలున్నారా?"

"ఎవరూ లేరు."

"మరి మీ వూళ్ళో ఎందుకు స్థిరపడ్డాడు?"

"ఏమో? అప్పటి సంగతి నాకు బాగా గుర్తుంది. ఆ రోజు మా ఇంటికి వచ్చి తను చాలా దూరం నుంచీ వచ్చానని, ఈ వూరు టౌన్‌కి దగ్గరగా వుంటుందనీ, తను ఈ వూళ్ళో స్థిరపడాలనుకుంటున్నాననీ చెప్పాడు."

"వూఁ...."

"రెండు ఎకరాలు పొలం కొనుక్కుని, చిన్న వూరిల్లు కట్టుకుని వుండిపోయాడు."

"ఈ తాతాచారి మంత్రగాడట గా?"

"అవును."

"చాతబడులు చేసేవాడా?"

"ఎవరికీ చేసినట్లు లేదు."

"పొలం తనే చేసుకునేవాడా?"

"ఆఁ....కొడుకు చేతికి సాయంగా వుండేవాడు. పొలం తనే చేసుకునేవాడు. ఎవరైనా వస్తే మంత్రాలు వేసేవాడు."

"ఏం మంత్రాలు?"

"పాము మంత్రం, తేలు మంత్రం వేసేవాడు. దెయ్యం పట్టిన వాళ్ళకి వదిలించేవాడు. తాయిత్తులు కట్టేవాడు."

"అతనికి ఆదాయం బాగానే వుండేదన్న మాట."

"ఫరవాలేదు."

"అతని కొడుకు గూడా మంత్రాలు వేసేవాడా?"

"ఆఁ....కొడుక్కి అన్నీ నేర్పుతున్నట్లు చెప్పేవాడు. పరాయి వూరు వెళ్ళాల్సి వస్తే ఇద్దరూ కలిసే వెళ్ళేవాళ్ళు."

"అతను వాళ్ళ స్వగ్రామం వదిలి ఎందుకొచ్చాడో మీకు తెలుసా?"

"నాకు వివరంగా తెలియదు కాని ఆ వూళ్ళో కొట్లాటలు ఎక్కువయ్యాయనీ, అన్నీ పార్టీలు, ముఠాలనీ, సుఖం లేకుండా పోయిందనీ అందుకే వదిలి వచ్చానని చెప్పాడు."

"మీరు అవన్నీ నమ్మారా?"

నవ్వాడు మునసబు.

"నమ్మక ఏం చేస్తాం?" అన్నాడు.

"అతనికి విరోధులు ఎవరైనా వున్నట్లు మీకు తెలుసా?"

మునసబు తల అడ్డంగా వూపి "నాకైతే అటువంటివి

తెలియదు" అన్నాడు.

"తండ్రీ, కొడుకుని ఇద్దర్నీ చంపారంటే, ఎవరో కసితో చంపి వుంటారు" అన్నాడు ఇనస్పెక్టర్.

"అవును."

"ఇతనివల్ల ఎవరికో నష్టం కలిగి వున్నప్పుడు ఆ పని చేస్తారు? మంత్రగాడిని వుట్టినే ఎవరు చంపుతారు?"

మునసబు మాట్లాడలేదు.

శవ పంచాయితీ జరిపించి శవాలను పోస్టుమార్టమ్‌కి పంపించాడు ఇనస్పెక్టర్.

హత్యలు చెయ్యడానికి వుపయోగించిన వెపన్స్ ఆ చుట్టుప్రక్కల ఎక్కడా దొరకలేదు.

ఇద్దరు కానిస్టేబుళ్ళను మఫ్టీలో ఆ సత్రం ప్రాంతంలోను, రాజుపాలెంలోను తిరగమనీ ఎవరైనా కొత్తవాళ్ళు కన్పిస్తే ఇన్ఫర్మేషన్ ఇవ్వమని ఆదేశించాడు.

# 3

"నీ పేరు ఏమిటమ్మా?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్ రమేష్ ఆమెను.

ఆమె తాతాచారి కోడలు. రెండో హతుడు వుపేంద్రాచారి భార్య.

ఆమె కన్నీళ్ళను తుడుచుకుంటూ వుంది. దుఃఖంతో ఆమె గొంతు పెగిలి రావడంలేదు. దూరంగా ఆమె పుట్టింటి తరఫు చుట్టాలు నిల్చుని ఆసక్తిగా గమనిస్తున్నారు.

"చెప్పమ్మా! ఈ సమయంలో ప్రశ్నలడిగి బాధించడం నాకు బాధగానే వుంది. కాని నా డ్యూటీ నేను చెయ్యాలి. మీ మామను, భర్తను హత్యచేసిన హంతకులను పట్టుకోవడానికి ఏదైనా ఆధారం దొరుకుతుందనే ఆశలో వున్నాను" అన్నాడు.

"నా పేరు అమృతం అండీ" అంది ఎంతో నెమ్మదిగా.

ఆమె ఎత్తుగా, చామనఛాయతో, పుష్టిగా బలంగా కన్పిస్తోంది. ఇరవై ఏళ్ళు పైన వుంటాయి ఆమెకు. మామ, భర్త ఒకేసారి హత్య చేయబడ్డంవల్ల ఆమె మానసికంగా వేదన పొందుతున్నదని ముఖం చూస్తేనే తెలుస్తోంది.

"చూడమ్మా! జాగ్రత్తగా ఆలోచించు. హత్య జరిగిన సాయంకాలం మీ మామను, మీ భర్తను ఎవరో పనిమీద పిల్చుకొని వెళ్ళారు. ఎవరో గుర్తుందా?"

"లేదండీ. నేనప్పుడు ఇంట్లో లేను."

"వూఁ...."

"గేదెలకు గడ్డి తేవడానికి వెళ్ళాను. వచ్చేసరికి ఇంటికి తాళం వేసి వుంది. అది నాకు మామూలే. నా దగ్గరొక తాళంచెవి వుంది. దాంతో తాళం తీశాను."

"ఓహోఁ....అయితే ఎక్కడికైనా వెళ్ళినప్పుడు నీకు చెప్పకుండా గూడా వెళ్తుంటారన్నమాట."

"అవునండీ" అంది అమృతం.

"మీ మామగారు మంత్రాలు వేస్తుంటారు గదూ!"

"అవును."

"చేతబడులు చేస్తాడా?"

ఆమె ఇబ్బందిగా చూసింది.

"ఫరవాలేదు చెప్పమ్మా!"

"ఇప్పుడు చెయ్యడం లేదండీ."

"అంటే లోగడ చేసేవాడా?"

"అఁ....ఈ వూరు రాకముందు చేసేవారు. అక్కడ గొడవైంది. అందుకని ఈ వూరు వచ్చేశాం."

"ఇక్కడకు రాకముందు ఏ వూళ్ళో వుండేవాళ్ళు."

"రాయనపాడు,"

"ఏం జరిగింది అక్కడ?"

"ఈయన డబ్బుకు ఆశపడి ఎవరికో చేతబడి చేశారు. అది తెలిసి వాళ్ళు కొట్టడానికి వచ్చారు. చేయించిన అతను పలుకుబడి గలవాడు. అందువల్ల బ్రతికి బైటపడి ఈ వూరు వచ్చేశాం" అంది అమృతం.

ఇనస్పెక్టర్ రమేష్ ఆలోచిస్తూ కూర్చున్నాడు కాసేపు.

"రాయనపాడులో వాళ్ళు మీ మామను చంపడానికి వచ్చి వుంటారని నీకేమైనా అనుమానం వుందా!"

ఆమె కాసేపు సమాధానం చెప్పలేదు.

"అది జరిగి చాలా ఏళ్ళయిందండీ. వాళ్ళు ఇన్నాళ్ళ తర్వాత ఎందుకు వస్తారు?" అంది.

"పోనీ మీ మామకుగాని మీ భర్తకుగాని ఎవరైనా పగవాళ్ళు వున్నారా?"

"నాకు సరిగా తెలియదండీ" అంది అమృతం.

"రాయనపాడులో మీ మామ చేతబడి చేసిన వ్యక్తి ఎవరు?"

ఆమె అన్నీ వివరంగా చెప్పింది.

"నీకు పెళ్ళయి ఎన్నేళ్ళయింది."

"ఆరేళ్ళయింది."

"పిల్లలు లేరా?"

ఆమె తల అడ్డంగా వూపింది లేరన్నట్లు.

తర్వాత ఆమెను మరికొన్ని ప్రశ్నలు అడిగాడు. కాని ఆమె నుంచి పనికొచ్చే సమాచారం ఏదీ రాలేదు.

"అవసరమైతే మళ్ళీ కలుసుకుంటానమ్మా!" అని చెప్పి తిరుగుముఖం పట్టాడు ఇనస్పెక్టర్.

వూరు చివర మట్టిలో తిరుగుతున్న కానిస్టేబుల్

నారాయణరావు జీప్ ఆపాడు.

స్టేషన్ వచ్చేవరకూ ఇనస్పెక్టర్ అతన్ని ఏమీ అడగ లేదు.

తర్వాత తీరికగా అతన్ని పిల్చాడు.

"ఏమైనా తెలిసిందా?"

"నాలుగు రోజుల క్రితమే కన్నయ్యా నాయుడు, వుపేంద్రాచారి పోట్లాడుకున్నారని తెల్సింది సార్!" అన్నాడు కానిస్టేబుల్.

"కన్నయ్యానాయుడు ఎవరు?"

"మునసబుగారి తమ్ముడు."

"ఎందుకు పోట్లాడుకున్నారు?"

"నిజం ఎంతోగాని అమృతానికి, కన్నయ్యానాయుడికి సంబంధం వుందట సార్. కన్నయ్యానాయుడి నిమ్మతోటకి పోతూ వుంటుందట అమృతం."

"వూఁ...." ఆసక్తిగా ముందుకు వంగాడు ఇనస్పెక్టర్.

"ఆ సంగతి వుపేంద్రాచారికి తెలుసట. చూసీ చూడ నట్లు పోతున్నాడట. ఈ మధ్య కన్నయ్యానాయుడు తండ్రీ కొడుకులు లేనప్పుడు అమృతం కోసం ఇంటికి వస్తున్నాడట. ఒక రోజున వీళ్ళు రాత్రి ప్రొద్దుపోయాక వచ్చేసరికి కన్నయ్యానాయుడు ఇంట్లో వున్నాడట. అప్పుడు తండ్రీ కొడుకులు అతన్ని కొట్టబోయారట."

"వూఁ....తర్వాత."

"ఈసారి ఎక్కడైనా చూస్తే నిన్ను ప్రాణాలతో వదిలిపెట్టనని వుపేంద్రాచారి అతన్ని బెదిరించాడట."

"వూఁ...."

"అదీ సార్!"

"ఇదంతా ఎవరు చెప్పారు నీకు?"

"వాళ్ళింటి ప్రక్కనే గుగ్గిళ్ళు అమ్ముకునే ముసలిది చెప్పింది. పావలా గుగ్గిళ్ళు కొని అంతా రాబట్టాను" అన్నాడు.

# 4

అనుమానం మీద కన్నయ్యానాయుడిని అరెస్టు చేసి స్టేషన్‌కి తీసుకొచ్చారు.

కన్నయ్యానాయుడు ఎత్తుగా సల్లగా వున్నాడు. కోర మీసాలతో మంచి విగ్రహపుష్టితో వున్నాడు. పాతికేళ్ళ పైనేవుంటుంది వయస్సు.

"నీ పేరు కన్నయ్యానాయుడా?"

"అవును." నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు.

"తాతాచారి, వుపేంద్రాచారి హత్యచేయబడిన రాత్రి ఎక్కడున్నావ్?"

"నా ఇంట్లోనే."

"సాక్ష్యం ఎవరు?"

"మా అమ్మ, నాన్న, మా అన్నయ్య, మా పాలేర్లు," అన్నాడు.

"నీకు పెళ్ళి కాలేదా?"

"లేదు."

"వాళ్ళు హత్యచేయబడిన రాత్రికి నాలుగు రోజుల ముందు నీకు వాళ్ళకి గొడవ జరిగినమాట నిజమేనా?"

"ఆఁ...."

"ఎందుకు జరిగింది గొడవ?"

కన్నయ్యానాయుడు చెప్పలేదు.

"చెప్పు." గద్దించాడు ఇనస్పెక్టర్ రమేష్.

"ఏదో పొలంగట్ల దగ్గర తగాదా!" అన్నాడు.

"అబద్ధం...." గట్టిగా అరిచాడు ఇనస్పెక్టర్.

కన్నయ్యనాయుడు అదోలా చూశాడు.

"నిజం చెప్పు."

"నిజమే."

"కాదు. నీకు అమృతంతో రహస్య సంబంధం వుంది. మగవాళ్ళు వూళ్ళో లేరని వచ్చావు. అనుకోకుండా వాళ్ళు వచ్చారు. రెడ్ హేండెడ్ గా పట్టుబడ్డావు. వాళ్ళు నిన్ను తన్నబోయారు. తప్పించుకొని పారిపోయావు. తాతాచారి మంత్రగాడు కాబట్టి ఎక్కడ చేతబడి చేసి చంపుతాడో నని భయపడి దారికాచి తండ్రీ కొడుకుల్ని చంపావు."

కన్నయ్యనాయుడు ఆందోళనగా చూశాడు ఇనస్పెక్టర్ వంక. అంతవరకూ నిర్లక్ష్యంగా వున్న వాడల్లా భయంతో వణికిపోయాడు.

"నిజం చెప్పు. తప్పు ఒప్పుకొంటే శిక్ష తక్కువ పడుతుంది. లేదా పాపానికి ఫలితం అనుభవిస్తావ్!" అన్నాడు ఇనస్పెక్టర్ రమేష్.

"లేదు సార్! నిజమే చెప్తున్నాను. అమృతంతో నాకు సంబంధం వున్నమాట నిజమే. కాని వాళ్ళని నేను చంపలేదు" అన్నాడు అతను. అతని కంఠం భయంతో వణుకుతూ వుంది.

"ఒకటి ఒప్పుకొన్నావు గదా! రెండోదిగూడా నువ్వే ఒప్పుకొంటావు" అని హెడ్ కానిస్టేబుల్ ని పిలిచి అతన్ని లాకప్ లో పడెయ్యమన్నాడు.

అనుమానంమీద అతన్ని అరెస్టు చేశారు. కాని కేసు నిలవడానికి తగిన ఆధారం దొరకడంలేదు. మునసబువచ్చి తమ్ముణ్ని జామీను మీద విడిపించుకొని పోయాడు.

కత్తిపోట్లవలన వాళ్ళు చనిపోయారని పోస్టుమార్టమ్

రిపోర్టులో డాక్టర్ ధృవపరిచాడు. కాని కత్తి దొరక లేదు. హంతకులెవరో తెలివిగా హత్యచేసి తప్పించు కొన్నారు.

కన్నయ్యనాయుడు మొదటి అనుమానితుడు. రెండు అమృతం. వీళ్ళిద్దరూ కలిసి హత్యలు చెయ్యడానికి అవకాశం వుంది.

ఇనస్పెక్టర్ రమేష్ ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

# 5

పోలీస్ స్టేషన్‌లో టెలిఫోన్ మ్రోగింది.

ఇనస్పెక్టర్ రమేష్ రిసీవర్ ఎత్తాడు.

"డియస్పీ స్పీకింగ్."

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు ఇనస్పెక్టర్.

"గుడ్ మార్నింగ్. మంత్రిగారి మర్డర్ కేసు ఏమైంది?"

"ఆ కేసు ఏమీ తేలలేదు సార్. అనుమానితుల్లో కన్నయ్యనాయుడు, హతుడి భార్య అమృతం వాళ్ళకి ఆ రాత్రి మంచి ఎలిబీ వుంది సార్! వాళ్ళు డైరెక్టుగా ఇన్వాల్వు కాలేదు సార్! వాళ్ళే చేయించి వుంటారని నాకు అనుమానం సార్! ఇన్వెస్టిగేట్ చేస్తున్నాను సార్!"

"వూఁ...."

"ఆ సత్రం దగ్గర మఫ్టీలో కానిస్టేబుళ్ళని వుంచాను సార్!"

"ఆఁ."

"ఆ వుంగరం ఎవరిదో ఇంకా తేలలేదు సార్!"

"ఏ వుంగరం?"

"అదే సార్! ఆ నీళ్ళకుంట దగ్గిర హంతకులు నెత్తురు చేతులు కడుక్కొన్నప్పుడు పడిపోయిన వుంగరం."

"అదా! ఎవరిదో తొందరగా తెలుసుకోండి."

"ఆ సుబ్బారావు ఎవరో ఇంకా తేలలేదు."

"ఏ సుబ్బారావు?"

"ఆ వుంగరం మీద జి. సుబ్బారావు అనే పేరు చెక్కి వుందిగదా సార్! అది తమకు చూపించానుగూడా!"

"ఓ.... సారీ. గుర్తొచ్చింది."

"ఆ సుబ్బారావు ఎవరో తెలిస్తే కేసు మలుపు తిరుగుతుంది సార్! ఒకవేళ కన్నయ్యనాయుడు కాకుండా ఆ సుబ్బారావే హంతకుడేమో నని అనుమానం వస్తోంది సార్!"

"సరే! ఇన్వెస్టిగేట్ చెయ్యండి."

అవతల రిసీవర్ పెట్టేసిన శబ్దం వచ్చింది.

ఇనస్పెక్టర్ రమేష్ రిసీవర్ క్రెడిల్ చేశాడు.

ఒక్కనిముషం తర్వాత టెలిఫోన్ మ్రోగింది.

"రమేష్ స్పీకింగ్ ప్లీజ్." అన్నాడు ఇనస్పెక్టర్ రిసీవర్ ఎత్తి.

"సార్! నేను యస్.ఐ. జోగారావుని మాట్లాడుతున్నానుసార్!"

"ఏమిటి సంగతి?"

"సార్! ఆ సెటిల్‌మెంట్ గ్యాంగ్‌లో ఇద్దరు రాళ్ళపల్లిలో వున్నట్లు ఇన్ఫరమేషన్ వచ్చింది. ఈ రాత్రికి ఇంకా కొందరు రావచ్చు. అంతా కలసి ఎవరింటికైనా దొంగతనానికి ప్లాన్ చేస్తున్నారేమోనని నా అనుమానం"

"దొంగతనం చేసి వారంకాలేదు అప్పుడే బయల్దేరతారంటావా?"

"ఏమోసార్! వాళ్ళగురించి చెప్పలేం. గుండెలు తీసిన బంటులు."

"అయితే ఏం చేద్దామంటావ్?"

"సాయంకాలం రాళ్ళపల్లి వెళ్ళిరైడింగ్ చేద్దాం సార్! దొరికిపోతారు."

"రాళ్ళపల్లి ప్రక్కనే గుట్టలున్నాయికదూ!"

"అవును సార్!"

"వాళ్ళు మన జాడ పసిగడితే గుట్టల్లోకి పారిపోవచ్చు."

"నిజమేసార్! ఎందుకైనా మంచిది రిజర్వ్‌ఫోర్స్ గూడా వెంట వుంటే."

"సరే. అలాగే డియస్పీగారితో మాట్లాడి, బయల్దేరే ముందు ఫోన్ చేస్తాను. ఓ.కే...."

"ఓ.కే. సార్!"

ఇనస్పెక్టర్ రమేష్, డియస్పీకి ఫోన్ చేశాడు.

"టౌన్ డియస్పీ రెసిడెన్స్ ప్లీజ్."

"ఇనస్పెక్టర్ రమేష్ స్పీకింగ్. డియస్పీగారున్నారా?"

"లేరు సార్! రెండు రోజులు సెలవు. ఈ రోజు రేపు. రూరల్ డియస్పీగారు యిన్‌ఛార్జి."

ఇన్‌స్పెక్టర్‌కి మతిపోయినట్లయింది. పది నిముషాల క్రితమే గదా తనతో మాట్లాడి మంత్రిగాళ్ళ మర్డర్ కేసు గురించి అడిగింది.

"పదినిముషాలక్రితం డియస్పీగారు నాతో మాట్లాడారు గదా! ఆయన వెళ్ళి ఎంతసేపయింది?"

ఫోన్‌లో సి.సి. నవ్వు వినిపించింది.

"భలే జోక్ చేస్తున్నారు సార్! డియస్పీగారు ఫస్టుబస్‌లో హైదరాబాద్ వెళ్ళారు. వాళ్ళ రిలేటివ్స్ మ్యారేజ్ ఫంక్షన్‌కి అటెండ్ కావడానికి. మీతో యెలా మాట్లాడారు?"

"అలాగా!...." అని రిసీవర్ పెట్టేశాడు యిన్‌స్పెక్టర్.

అంటే యెవడో డియస్పీలా మాట్లాడి తన నుంచి యిన్ఫర్మేషన్ రాబట్టాడన్నమాట. తనని ఫూల్ చేశాడు. హంతకుడు తన చర్యలను తెలుసుకుంటున్నాడు.

ఇన్‌స్పెక్టర్ రమేష్ ముఖం కోపంతో యెర్రబడింది.

# 6

జి. సుబ్బారావు అనే వాళ్ళు ఎందరున్నారో తెలుసుకోవడానికి ఓటర్ల లిస్టులు తెప్పించి పరిశీలించసాగాడు.

ఇంటి పేరు జి. వచ్చేటట్లు వున్న సుబ్బారావులు వందకు పైగా దొరికారు. అసలు దేశంలో సుబ్బారావులే యెక్కువేమో అనే అనుమానం వచ్చింది. వంద మంది సుబ్బారావుల్లో యెవర్ని అనుమానించాలి?

ఎందుకైనా మంచిదని ఆ సుబ్బారావులు ఏ ఏ పేటలలో వున్నారో అడ్రసులన్నీ నోట్ చేయించి స్టేషన్ రికార్డులలో వుంచాడు.

మంత్రిగాళ్ళ మర్డర్ జరిగి యిట్టే పదిహేను రోజులు గడిచిపోయాయి. అమృతం తన మావకి, భర్తకి దిన వారాలైన తర్వాత పుట్టింటికి వెళ్ళిపోయింది.

హంతకుల జాడ తెలియడం లేదు. ఇది మొండి కేసుగా వుండిపోతుందేమో అనిపిస్తోంది యిన్‌స్పెక్టర్‌కి.

మర్నాడు ప్రొద్దున్నే సరిగా నిద్రలేవకముందే స్టేషన్ నుంచి కబురొచ్చింది నెహ్రూ పార్కులో మర్డర్ జరిగిందని. గబగబా కాలకృత్యాలు తీర్చుకుని, కాఫీ త్రాగి బయలుదేరాడు.

నెహ్రూ పార్కు ఊరి చివర్లో చెరువు ప్రక్కనే వుంది. ఇండిపెండెన్స్ వచ్చిన కొత్తల్లో మున్సిపాల్టీ

వాళ్ళు బాగానే మెయింటేన్ చేశారు. రాను రాను అందులో చిన్న చిన్న మొక్కలను నిర్లక్ష్యం చేశారు. పెద్ద పెద్ద చెట్లు, కాగితం పూల పొదలు మాత్రం దట్టంగా పెరిగివున్నాయి. ఇప్పుడది నామ మాత్రం పార్కు.

సిమెంట్ బెంచీలమీద అడుక్కునేవాళ్ళు, తిరుగు బోతులు పడుకుని నిద్రపోవడానికి వీలుగా వున్నాయి. అక్కడక్కడా గుడ్డిదీపాలు వెలుగుతూ వుంటాయి. ఆ ప్రక్కనే చెరువు జనానికి మరుగుదొడ్డిగా ఉపయోగ పడుతూ దుర్వాసన వేస్తూ వుంటుంది.

ఇన్‌స్పెక్టర్ వెళ్ళేసరికి పోలీసులు జనాన్ని దూరంగా తరిమేశారు.

శవం వెల్లకిలా పడివుంది. నాలుక బైటకొచ్చి వికృతంగా వుంది. కళ్ళు తెరుచుకునే వున్నాయి. ఎవరో గొంతు నులిమి చంపినట్లుగా వుంది.

ఆ ప్రదేశం ఒక పొదలా వుంది. మూడు వైపులా కాగితం పూలచెట్లు దట్టంగా పెరిగి వున్నాయి. నాలుగో వైపు చెరువు గట్టు. అక్కడ కూర్చుంటే యెవరికీ కనిపించే అవకాశం లేదు.

చెరువుగట్టుమీద సీసాలు పగిలిన ముక్కలున్నాయి. దగ్గరగా వెళ్ళి చూస్తే అవి బీరుసీసాలు. మొత్తం రెండు వున్నాయి. నూసె మరకలు అంటిన కాగితాలు పొదల్లో చిక్కుకుని వున్నాయి.

వెన్నెల రాత్రులు గనుక రాత్రి యిక్కడ కూర్చుని త్రాగి వుంటారు. ఆ తర్వాత అతన్ని గొంతు నులిమి చంపిపోయారు.

హంతుడికి ముఫ్ఫైయేళ్ళు పైనే వుంటాయి. గడ్డం

కొంచెం మాసి వుంది. తెల్ల పైజామా, లాల్చి వేసుకుని వున్నాడు.

శవం ఎవరిదో యింకా తెలియలేదు.

ఫోటోగ్రాఫర్ ఫోటోలు తీస్తున్నాడు వివిధ కోణా లలో.

బీరుసీసాల ముక్కలమీద హంతకుడి వేలిముద్రలు దొరకవచ్చునని వాటిని జాగ్రత్తచేసి ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్‌కి పంపారు.

టౌన్ డియస్పీ హత్యా ప్రదేశం చూసి వెళ్ళి పోయాడు.

శవ పంచాయితీ జరిపిన తర్వాత శవాన్ని హెడ్ క్వార్టర్స్ హాస్పటల్‌కి పంపారు.

## 7

నెహ్రూ పార్కులో యెవరో హత్య చేసిన సంగతి కాంచీ నగరంలో అన్ని పేటలవారికీ తెలిసి పోయింది.

అతన్ని బంధువులు గుర్తించారు. అతను మున్సిపాలిటీలో అటెండర్‌గా పనిచేస్తున్నాడు. అతని పేరు గార్లె సుబ్బారావు. అంటే జి. సుబ్బారావు.

ఇన్‌స్పెక్టర్ రమేష్‌కి చాలా ఆశ్చర్యంగా వుంది.

తను జి. సుబ్బారావు యెవరో తెలుసుకోవాలని అను కుంటున్నాడు.

కాని ఒక జి. సుబ్బారావు హత్య చేయబడ్డాడు.

ఏమిటీ విచిత్రం?

జి. సుబ్బారావు పేరు వున్న వుంగరం తీసుకుని హతుడి యింటికి బయలుదేరి వెళ్ళాడు యిన్‌స్పెక్టర్.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

డ్రైవర్ జీప్ హారన్ కొట్టాడు.

ఎవరో ఒక ముసలాయన వచ్చాడు.

"రండి" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ జీప్ దిగాడు.

"ముకుందరావుగారు వున్నారా?"

"ఆఁ....రండి. కూర్చోండి" అన్నాడాయన.

కాసేపటికి ముకుందరావు వచ్చి నమస్కారం చేశాడు. అతను సుబ్బారావు అన్న. అతనే శవాన్ని తన తమ్ముడిదిగా గుర్తించాడు.

"ఈ వుంగరం చూడండి" అంటూ ముకుందరావుకి అందించాడు యిన్‌స్పెక్టర్.

ముకుందరావు దాన్ని చూసి యెంతో ఆశ్చర్యపోయాడు.

"అది మీ తమ్ముడిదేనా?" ప్రశ్నించాడు.

"అవును సార్! మీ కెలా వచ్చింది?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు.

"నా కెలా వచ్చింది అన్నది ప్రశ్న కాదు. అది మీ వాడి దగ్గర్నుంచి యెలా పోయింది అన్నది ప్రశ్న?"

"ఏమిటి సార్ మీ రనేది?" అర్థంకానట్లు చూశాడు ముకుందరావు.

"ఇది మీ తమ్ముడి దగ్గర్నుంచి యెప్పుడు పోయింది?"

"రెండు నెలల క్రితం యెక్కడో పడిపోయిందని చెప్పాడు."

"అలాగా?"

"కాని అది అబద్ధం సార్!"

తలెత్తి చూశాడు యిన్‌స్పెక్టర్.

"మా వాడి ప్రవర్తన మంచిది కాదు. వాడికి పేకాట

పిచ్చి, త్రాగుడు అలవాట్లు ఉన్నాయి. రెండేళ్ళయింది పెళ్ళిచేసి. ఆ ఉంగరం వాళ్ళ మామగారు చేయించిందే. మొన్న మొన్నటి వరకూ భార్య నగలు అమ్ముకున్నాడు. ఇక మిగిలింది ఆ ఉంగరం ఒక్కటే. దాన్ని అమ్ముకున్నాడు" అన్నాడు ముకుందరావు.

"ఎవరికి అమ్మాడో మీకు తెలుసా?"

"లేదు సార్! వాడికి నేనంటే లెక్కలేదు. నాకు యే విషయమూ చెప్పడు" దిగులుగా అన్నాడు అతను.

ఇన్స్పెక్టర్‌కు నీరసం ముంచుకు వచ్చింది.

# 8

పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చింది.

హంతకుడు మద్యం త్రాగి వున్నాడు. రాత్రి తొమ్మిది పది గంటల మధ్య ప్రాణం పోయింది. చేతులతో కంఠం బలంగా నొక్కడంవల్ల వూపిరాడక ప్రాణం పోయింది.

సీసాలమీద యిద్దరి వేలిముద్రలు వచ్చాయి. ఒకడు హతుడు. రెండోవాడు హంతకుడు.

మంత్రాల తాతాచారిని, అతని కొడుకునీ హత్య చేసినవాడే యీ సుబ్బారావునీ హత్య చేశాడని బలపడింది.

హంతకుడు తెలివిగా వ్యవహరిస్తున్నాడు. హత్యా రహస్యం బయటపడకుండా చూసుకుంటున్నాడు. పోలీసులు యేంచేస్తున్నదీ ముందుగానే తెలుసుకొని ఆచూకీ తెలియకుండా జాగ్రత్తపడుతున్నాడు. సుబ్బారావుని చంపడం అందులో ఒక భాగం.

హంతకుడు తన వేలి ఉంగరం నీళ్ళగుంట దగ్గర వదిలి

పొరపాటు చేశాడు. ఆ కంగారులో ఆ సంగతి అతను గ్రహించలేకపోయాడు.

ఆ వుంగరం జి. సుబ్బారావుది. అది అతను హంతకుడికి అమ్మాడు. సుబ్బారావు కోసం పోలీసులు శోధిస్తున్నారు. అతను తను ఉంగరాన్ని యెవరికి అమ్మిందీ చెపితే హంతకుడు బయటపడిపోతాడు.

ఆ సంగతి తెలుసుకుని హంతకుడు సుబ్బారావుని పోలీసులకు చిక్కకుండా చంపగలిగాడు. కాని అతని వేలిముద్రలు దొరికాయి. అతన్ని పట్టుకునే ఆధారం అదొక్కటే.

కేసులో మొదటి అనుమానితుడు కన్నయ్యనాయుడి వేలిముద్రలు తీసుకున్నారు. కాని అవి సరిపోలేదు. హంతకుడు కన్నయ్యనాయుడు కాదు.

కన్నయ్యనాయుడు పాత నేరస్తులను యెవర్నయినా హత్యలకు వినియోగించాడేమోనని వేలిముద్రలు ఫింగర్ ప్రింట్స్ బ్యూరోకి పంపారు. కాని నెగిటివ్ రిపోర్టు వచ్చింది. పాత నేరస్తు లెవరూ ఈ హత్య చేయలేదు.

కానిస్టేబుల్ నారాయణరావు తెలివైన వాడు. అతన్ని మఫ్టీలో పంపాడు మున్సిపాల్టీ ఆఫీసుకి. సుబ్బారావు యెవరెవరితో స్నేహంగా ఉండేవాడు? పేకాట యెక్కడ ఆడేవాడు? అవన్నీ తెలుసుకుని రమ్మని.

రెండు రోజులు తిరిగి కొంత సమాచారం సేకరించాడు నారాయణరావు.

సెల్యూట్ చేసి నిల్చున్నాడు నారాయణరావు.

"సార్!"

"ఏమిటి విశేషాలు?"

"కొంత తెలిసిందిసార్!"

"ఏమిటది?"

"సుబ్బారావు గురించి."

"చెప్పు."

"మున్సిపాల్టీ బిల్డింగ్స్‌ని ఆనుకుని ఒక సైకిల్ షాపు ఉంది సార్. అక్కడ సైకిళ్ళు అద్దె కిస్తుంటారు. రిపేరు కూడా చేస్తారు."

"ఆ షాపు పేరేమిటి?"

"దానికి బోర్డు లేదు సార్! చూడ్డానికి గలీజుగా ఉంటుంది. అన్నీ యినుప ముక్కలు, సైకిలు పార్టులతో నిండి వుంటుంది."

"వూఁ...."

"ముందు భాగంలో అవన్నీ వుంటాయి. మధ్యలో తలుపు ఉంది. కాని ముందునుంచి చూస్తే కన్పించదు. ఎందుకంటే ఆ షాపు మధ్యలో ఒక చెక్క బీరువా అడ్డంపెట్టాడు. ఆ బీరువాకి రెక్కలు వుండవు. దాని లోనూ స్పేర్ పార్టులే వుంటాయి. ఆ బీరువాకి సరిగ్గా వెనుక వుంది తలుపు.

లోపల రెండు పెద్ద గదులు వున్నాయి. ఆ గదుల్లో సాగుతుంది పేకాట. ఇది యెవరికీ తెలియదు. అందులో ముఖ్యంగా మున్సిపాల్టీలో పనిచేసే లో పెయిడ్ ఉద్యోగులు ఆడుతూ వుంటారు. సుబ్బారావు అక్కడే పేకాట ఆడుతూ వుంటాడని తెలిసింది."

తల వూపుతూ వింటున్నాడు యిన్‌స్పెక్టర్.

"ఆ షాపు ఓనర్ ఎవరో తెలుసుకున్నావా?"

"వాడి పేరు బంగారయ్య సార్."

"పద వాడి సంగతి తేల్చుకుందాం."

"ఇప్పుడు యెవరూ దొరకరు సార్! రాత్రి ఎనిమిది

దాటితే దొరుకుతారు" అన్నాడు కానిస్టేబుల్ నారా యణరావు.

## 9

రాత్రి తొమ్మిది దాటింది.

మున్సిపాల్టీ బిల్డింగ్స్ టౌన్ మధ్యలో వుంది కాబట్టి ఆ రోడ్డు రాత్రి పది, పదకొండు గంటలవరకూ రద్దీగానే వుంటుంది.

లారీలు, బస్సులు, చిన్న కార్లు హడావిడిగా తిరుగుతున్నాయి. సైకిల్ రిక్షాలు, సైకిళ్ళూ గంటలు కొట్టుకుంటూ జనాన్ని తప్పుకుని తిరుగుతున్నాయి. జనం గుంపులు గుంపులుగా షాపుల ముందు బేరాలు చేస్తున్నారు. తొమ్మిది దాటినా రద్దీ తగ్గలేదు.

బంగారయ్య కొట్టుముందు కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు. సైకిళ్ళు కొన్ని ఒక మూలగా నిలబెట్టివున్నాయి. ఇరవై కాండిల్ బల్బు గుడ్డిగా వెలుగుతోంది.

సడన్‌గా పోలీస్ జీప్, పోలీస్ వ్యాన్ వచ్చి ఆ కొట్టుముందు ఆగాయి.

జీప్‌లోనుంచి డియస్పీ, సి. ఇ., యస్.ఐ.లు దిగారు. వ్యాన్‌లోనుంచి కానిస్టేబుళ్ళు దిగి బంగారయ్య కొట్టును చుట్టుముట్టారు.

బంగారయ్య బిత్తరపోయాడు. లోపల పేకాట ఆడుతున్న వాళ్ళని హెచ్చరించడానికిగూడా వీల్లేకపోయింది. పాలిపోయిన ముఖంతో నిలబడిపోయాడు.

లోపల దాదాపు ఇరవైమంది మంచి రసపట్టులో వున్నారు. అంతా చాపలమీదే కూర్చుని పేకాట ఆడుతున్నారు. సిగరెట్ పీకలు, బీడీ ముక్కలతో పొగతో

అసహ్యంగా వుంది వాతావరణం.

అందర్నీ పేకముక్కలు, చాపలు, డబ్బుతో సహా అరెస్టుచేసి వ్యాన్ ఎక్కించి స్టేషన్ కి తీసుకెళ్ళి లాకప్ లో పడేశారు.

అంతా మున్సిపాల్టీలో పనిచేస్తున్నవాళ్ళే యెక్కువ మంది వున్నారు. ప్రైవేట్ వ్యక్తులు నలుగురు కంటే యెక్కువ లేరు.

తక్కువ జీతంతో పనిచేస్తున్న అటెండర్లు, స్వీపర్లు వగైరా బలహీనతలను ఆధారం చేసుకుని బంగారయ్య తన షాపులోనే పేకాట అరేంజిచేసి సంపాదించుకుంటున్నాడు.

జనాన్ని స్టేషన్ కి తీసుకెళ్ళేసరికి పదకొండయింది. వాళ్ళందర్నీ మర్నాడు కోర్టుకి పంపించమని చెప్పి డియస్పీ వెళ్ళిపోయాడు.

అందరి పేర్లు నోట్ చేసుకుని లాకప్ లోకి నెట్టారు.

అసలయినవాడు బంగారయ్య దిక్కుతోచకుండా పిచ్చివాడిలా నిల్చుండిపోయాడు. అందరూ అతన్ని తిట్ట సాగారు. వాళ్ళు చెప్పిన దాన్ని బట్టి బంగారయ్య ఆటకు యింత అని వసూలు చేసుకుంటాడనీ, పోలీసుల గొడవలు వస్తే తను చూసుకుంటానని హామీ యిచ్చాడని అందువల్ల తాము అంత ధైర్యంగా ఆడుకుంటున్నామని తేల్చారు.

"సరే! మీ అందరికీ పడే జుల్మానా నేను కట్టు కుంటాను" అన్నాడు బంగారయ్య వాళ్ళ తిట్లు పడలేక.

"జుల్మానా సరే. మా పరువేం గావాలి. ఇంట్లో వాళ్ళు మొఖాన వూస్తారు" అని కొందరు వాపోయారు.

"జూదం ఆడేవాళ్ళకి పరువేంటోయ్! రోజులన్నీ

మనవేనా? అప్పుడప్పుడూ తప్పదు” అన్నాడు బంగా రయ్య.

“పోలీసులు రాకుండా చూసుకుంటానన్నావుగా?”

“ఇన్నాళ్ళూ కాసుకోడం లేదా? అప్పుడప్పుడూ ఆళ్ళకి కేసులు కావాలన్నప్పుడు పట్టుకుంటారు. మామూలే,” బంగారయ్య వాళ్ళకి సర్ది చెపుతున్నాడు.

లాకప్‌లో వాళ్ళ గొడవంతా ఇనస్పెక్టర్‌కు విని పిస్తూనే వుంది.

బంగారయ్యని తీసుకుని రమ్మన్నాడు లాకప్‌లో నుంచి.

అతను వచ్చి వినయంగా చేతులు కట్టుకొని దీనంగా చూస్తూ నిల్చున్నాడు.

“అయ్యా!....అయ్యా!” అంటున్నాడు.

“ఎన్నాళ్ళ నుంచి సాగుతోంది ఈ వ్యవహారం....?” గద్దించాడు ఇనస్పెక్టర్ రమేష్.

“ఈ మధ్యనే సార్!”

“సరిగ్గా చెప్పు?” కళ్ళు పెద్దవి చేశాడు.

“నిజం సార్! నాలుగయిదు నెలలనుంచి. ఏదో సార్! డబ్బుకి కక్కుర్తిపడి షాపులో ఆడనిచ్చాను. నా కసలు ఇష్టం లేదు. అంతా మున్సిపాలిటీ వాళ్ళే. వాళ్ళతో విరోధం ఎందుకని ఒప్పుకున్నాను” అన్నాడు బంగా రయ్య.

“వాళ్ళంతా మున్సిపాలిటీ వుద్యోగులేనా?”

“అవును సార్! ఏదో సరదాగా ఆడుకుంటారు. కాదన లేక వూరుకుంటున్నాను.”

“వాళ్ళకి పెట్టుబడి ఎవరు పెడతారు?”

“ఎవరిది వాళ్ళే తెచ్చుకుంటారు.”

"తెచ్చుకుంటారు సరే! నెల సగంలో డబ్బు అయి పోతుంది. అప్పుడు వాళ్ళకి అప్పులు ఇచ్చేది యెవరు? నువ్వేగా?"

"ఇస్తాను సార్!"

"ఆం....అలా చెప్పు. లేకపోతే నెలపొడుగునా వాళ్ళదగ్గర డబ్బు యెక్కడుంటుంది? వడ్డీ యెంత తీసుకుంటావ్?"

"నూటికి పది."

"అమ్మో! ఇంకేవుంది. కొంప దివాళా?"

"నేను నెలకి తీసుకుంటాను సార్! కొందరు వారానికే తీసుకుంటారు."

"మరి వాళ్ళు నమ్మకంగా తిరిగి ఇస్తారా?"

"ఇస్తారు సార్. లేకపోతే ఆటకి రావడానికి వీలుండదు కదా సార్!"

"అలాగా!....అదిసరే సుబ్బారావు అని అటెండర్ వుండేవాడు మునిసిపాలిటీలోనే. నీకు తెలుసా?"

"సుబ్బారావా?" అంటూ బుర్ర గోక్కున్నాడు బంగారయ్య.

"ఈమధ్య నెహ్రూ పార్కులో ఎవరో చంపారు అతన్ని" అన్నాడు ఇనస్పెక్టర్ బంగారయ్య ముఖం వంక పరిశీలనగా చూస్తూ.

"ఆం....అతనా సార్! తెలుసు సార్! అప్పుడప్పుడూ పేకాటకి వచ్చేవాడు."

"తెలుసుగదా! అతను ఏదయినా వుంగరం నీకు అమ్మాడా?"

"వుంగరమా? లేదు సార్."

"నిజం చెప్పు" గద్దించాడు.

"దేవుడితోడు సార్!" నెత్తిమీద చెయ్యి పెట్టుకున్నాడు బంగారయ్య.

"నీ సంగతి తేలుస్తాను చూడు." అని స్టాంప్ పాడ్ తెప్పించాడు.

బంగారయ్యతో సహా అందరి వేలిముద్రలూ తీసుకున్నాడు ఇనస్పెక్టర్. బంగారయ్యకు క్లబ్బులో సహాయపడే అనుచరులు, బంగారయ్య భయం భయంగా వేలిముద్రలు వేశారు.

"సుబ్బారావుని చంపింది ఎవరో రేపే తేలుస్తాను. వీళ్ళని జాగ్రత్తగా చూస్తుండండి" అన్నాడు ఇనస్పెక్టర్ రమేష్ వుత్సాహంతో.

# 10

సుబ్బారావుని హత్యచేసిన వ్యక్తి ఎవరో తేలలేదు. దాదాపు ఇరవై మంది వేలిముద్రలలో ఒక్కరివి గూడా బీరు సీసామీది ముద్రలతో సరిపోలేదు.

ఇనస్పెక్టర్ రమేష్‌కి చాలా ఆశ్చర్యం వేసింది. సుబ్బారావుని చంపిన హంతకుడు చిక్కుతాడనీ, తద్వారా మంత్రిగాళ్ళని హత్యచేసిన వ్యక్తి దొరుకుతాడనీ ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. కాని అతని ఆశ నిరాశయ్యింది. నిరుత్సాహం కలిగింది, ఇన్ని ప్రయత్నాలు చేసినా ఏమీ లాభం కనపడనందుకు.

జూదం ఆడిన వాళ్ళని కోర్టుకు పంపారు. అందరికీ ఫైన్ వేశారు. డబ్బుకట్టి బయటపడ్డారు.

బంగారయ్య సైకిల్ షాపులో పేకాట బంద్ అయింది.

సెంట్రల్ కేఫ్‌లోకి వెళుతున్న వ్యక్తిని గుర్తుపట్టాడు మఫ్టీలో తిరుగుతున్న కానిస్టేబుల్ నారాయణరావు.

అతని పేరు భద్రయ్య. బంగారయ్య క్లబ్బులో అతని తర ఫున వ్యవహారాలు నడుపుతూ వుండేవాడు. ఒక రకంగా రైట్ హేండ్ అని చెప్పుకోవచ్చు. క్రితంరోజు పట్టుబడ్డ వాళ్ళలో అతనూ వున్నాడు.

ఇప్పుడు భద్రయ్య వెంట ఇంకో కుర్రాడుగూడా వున్నాడు. ఇద్దరికీ పాతికేళ్ళు లోపే వుంటాయి.

వాళ్ళని అనుసరించి వెళ్ళాడు.

"బొత్తిగా కన్పించడమే మానేశావేమిటి?" అన్నాడు భద్రయ్య అతనితో.

ఇద్దరూ కూర్చున్న టేబుల్ వెనక కుర్చీలోనే కూర్చు న్నాడు నారాయణరావు. వాళ్ళమాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"బంగారయ్య షాపుకి రావద్దన్నాడు" అన్నాడు అతను.

"ఏం?"

"ఏమో?"

"నీకు తెలియకుండా వుంటుందిరా బాబూ!"

"నిజంరా భద్రయ్యా!"

"ఏదయినా గొడవ జరిగిందా?" భద్రయ్య ప్రశ్నిం చాడు.

"ఏమీ లేదు."

"ఆరోజు నువ్వు పనిమీద బయిటికెళ్ళడం మంచి దయింది. లేకపోతే నిన్నూ పట్టుకెళ్ళేవాళ్ళు పోలీసులు. రాత్రంతా కొట్లో పెట్టారు. చచ్చాం అనుకో" నవ్వాడు భద్రయ్య.

"ఆఁ....అదంతా నా అదృష్టం!"

"మరి ఇప్పుడు ఏం చేస్తున్నావ్?"

"వూరికే తిరుగుతున్నాను. బంగారయ్య మళ్ళీ క్లబ్బు మొదలు పెట్టిందాకా ఏం పనిలేదు."

"క్లబ్ లేకపోతే మానె. నీకు సైకిల్ రిపేరింగ్ తెలుసుగదా! షాపులో వుండి ఆ పనన్నా చెయ్యమని అనలేదా?"

"వుహూం....కొన్నాళ్ళు అసలు షాపువైపే రావద్దన్నాడు" అన్నాడు.

"ఒరేయ్! చిట్టిబాబూ! నీ మాటలు నాకు యేమీ అర్థం కావడంలేదు. అయోమయంగా వున్నాయ్!" అన్నాడు భద్రయ్య.

"ఇప్పుడు అర్థం కాకపోతే కొంపలేం మునగలేదులే!" అని నవ్వాడు చిట్టిబాబు.

"చాలా రోజులయింది మందు వేసుకుని. ఈ పూట వేయిస్తావా?" అన్నాడు భద్రయ్య.

"పద! దానికేం భాగ్యం" అన్నాడు చిట్టిబాబు.

ఇద్దరూ హోటల్లోంచి బయటపడ్డారు.

అప్పుడు సాయంకాలం ఆరయింది.

నారాయణరావు వాళ్ళని కనిపెడుతూనే వున్నాడు.

భద్రయ్య, చిట్టిబాబు సారాయి కొట్లోకి వెళ్ళడం చూశాడు.

సెంట్రల్ కేఫ్‌లోకి వెళ్ళి ఫోన్ యెత్తాడు.

"ఇనస్పెక్టర్ రమేష్ స్పీకింగ్ ప్లీజ్!" అవతలి కంఠం వినిపించింది.

"సార్! నేనూ! ఫైవ్ ట్వంటీత్రీ మాట్లాడుతున్నాను."

"ఎక్కడ్నుంచి?"

"మున్సిపల్ ఆఫీస్ సెంటర్‌లో సెంట్రల్ కేఫ్‌నుంచి

సార్!"

"ఏమిటిది?"

"బంగారయ్య క్లబ్బులో మొన్న రైడింగ్‌లో దొరకని వాడు చిట్టిబాబు అని...."

"ఆఁ....కన్పించాడా?"

"అవును సార్! భద్రయ్య అనే వాడితో కలిసి సెంట్రల్ కేఫ్‌కివచ్చి వెళ్ళారు."

"వెళ్ళిపోయారా?"

"సారాయి కొట్లోకి వెళ్ళారు యీ ప్రక్క సందులోకే."

"ఆఁ"

"బంగారయ్య వాడిని షాపుకి రావద్దని చెప్పాడట. వాడిమీద నాకు అనుమానంగా వుంది సార్!"

"సరే! నేను ఎస్. ఐ. ని వ్యాన్‌లో పంపుతున్నాను. నువ్వు అక్కడే వుండు."

"ఎస్సార్!"

అవతల ఫోన్ పెట్టేశాడు.

## 11

మున్సిపల్ ఆఫీసు సెంటర్లో పోలీస్‌వ్యాన్ ఆగింది. ఎస్. ఐ., హెడ్‌కానిస్టేబుళ్ళు హడావుడిగా దిగారు.

నారాయిణరావు వాళ్ళని వెంటబెట్టుకొని సారాయి కొట్లోకి వెళ్ళాడు.

పోలీసుల్ని చూసి తాపీగా సారాయి తాగుతున్న జనం కంగారు పడ్డారు. తెల్లముఖం వేసి చూస్తున్నాడు కౌంటర్లో కూర్చున్న వ్యక్తి.

నారాయణరావు చిట్టిబాబుని చూపించాడు.

పోలీసులు అతనికి బేడీలువేసి లాక్కెళ్ళి వ్యానులో

పడేశారు.

చిట్టిబాబు వలలో పడిన చేపలా కొట్టుకుంటున్నాడు పోలీసుల చేతుల్లో.

"ఎందుకట్లా గుంజుకుంటావ్? పారిపోదామనే?" నవ్వాడు ఇనస్పెక్టర్ రమేష్ స్టేషన్‌కు తీసుకొచ్చాక.

భయంతో బేలగా చూశాడు చిట్టిబాబు.

లాఠీ చేత్తో పట్టుకొని దగ్గరగా వస్తున్న ఇనస్పెక్టర్ని చూసి పెద్దపులిని చూసిన లేడిపిల్లలా వణికిపోతున్నాడు చిట్టిబాబు.

"నిజం చెప్తే నిన్నేమీ చెయ్యను. లేకపోతే నరకం అనుభవిస్తావు" అన్నాడు ఇనస్పెక్టర్.

"నాకేం తెలియదు సార్!" అన్నాడు చిట్టిబాబు.

"నీకు ఏం తెలుసో నాకు తెలుసు. మర్యాదగా తన్నులు తినకుండా చెప్పు. సుబ్బారావుని చంపింది యెవరు?"

"ఏమో సార్! నాకు తెలియదు."

"వాడు అలా ఎందుకు చెప్తాడు సార్! నేను చెప్పిస్తాను చూడండి" అంటూ మీదకు వచ్చాడు ఎస్. ఐ.

"మనకంత శ్రమ యెందుకు? పాడ్ తెప్పించి ముందుగా వేలిముద్రలు తీసుకో. తేలిపోతుంది" అన్నాడు ఇనస్పెక్టర్ రమేష్.

చిట్టిబాబు వేలిముద్రలు తీసుకుని అతన్ని లాకప్‌లో పడేశారు.

బీరుసీసా మీద వచ్చిన వేలిముద్రలు చిట్టిబాబువే అని తేలిపోయింది పరిశీలనలో.

గత్యంతరం లేక ఒప్పుకున్నాడు చిట్టిబాబు, సుబ్బారావుని చంపింది తనే అని. కాని సుబ్బారావుని చంప

డానికి అతనితో విరోధం ఏమీలేదు. బంగారయ్య పుర మాయించితే చంపాడు. అందుకు వెయ్యిరూపాయలు ముట్టజెప్పాడు బంగారయ్య.

పోలీసులు బంగారయ్యను పట్టుకొచ్చారు. లబోదిబో అని ఏడుస్తూ వచ్చాడు బంగారయ్య.

"చెప్పు, సుబ్బారావుని ఎందుకు చంపించావు? నీకు అతనితో విరోధం ఏమిటి?"

"అతనితో నాకు ఏ పేచీలేదు సార్!" అన్నాడు బంగారయ్య.

"ఏమీ లేకపోతే వెయ్యిరూపాయలు ఖర్చుపెట్టి సుబ్బారావుని ఎందుకు చంపించావు?"

"ఆ డబ్బు నేను ఇవ్వలేదు సార్!"

"నువ్వే ఇచ్చావని చిట్టిబాబు చెప్పాడు. అనవసరంగా బుకాయించకు. నీ ఆటలు మా దగ్గర సాగవు. నీ పాపం పండింది. ఊఁ.... చెప్పు."

"ఇదంతా రాజశేఖరం పని సార్!" అన్నాడు బంగారయ్య.

"రాజశేఖరం ఎవరు?"

"నీలిమ రెస్టారెంట్ ప్రొప్రయిటర్ కొడుకు సార్!" అన్నాడు బంగారయ్య.

"ఏమిటీ కారు యాక్సిడెంట్‌లో పోయిన శేషయ్య కొడుకేనా?"

"ఆఁ....అతనే సార్!"

"వాట్? అతను కుర్రాడే నే. అతను ఎందుకు చేయించాడు ఇదంతా?"

"ఏమో సార్!"

"ఊఁ....మంత్రగాడు తాతాచారిని, అతని కొడుకును

చంపింది మీ ముఠాయే నన్నమాట. మీ అందరికీ వురి శిక్షలు తప్పవు" అన్నాడు ఇనస్పెక్టర్.

బంగారయ్యా చటుక్కున వంగి ఇనస్పెక్టర్ కాళ్ళు పట్టుకున్నాడు.

"సార్! ఇందులో నాకేం తెలియదు సార్! చంపింది చిట్టిబాబు. చంపించింది రాజశేఖరం. మధ్యలో నేను చేసింది ఏమీ లేదు సార్!" ఏడుస్తూ అన్నాడు బంగారయ్యా.

"ఎందుకు లేదు? నువ్వు మీడియేటర్‌వి. రాజశేఖరం దగ్గర డబ్బు తీసుకొని హత్యలు చేయించావు. నువ్వే నేరస్తుడివే. నిన్ను క్షమించి వదిలేదు లేదు" అన్నాడు ఇనస్పెక్టర్.

## 12

"వాళ్ళు చెప్పింది నిజమే ఇనస్పెక్టర్. తాతాచారినీ, వాడి కొడుకుని చంపించింది నేనే. అక్కడ చిట్టిబాబు తన వేలి ఉంగరం జారవిడిచి పొరపాటు చేశాడు. ఆ తప్పు సరిదిద్దుకోవడానికి సుబ్బారావుని హత్య చేయాలని బంగారయ్యే సూచించాడు. నేను మీ చర్యలను గమనిస్తూనే ఉన్నాను. కాని లాభం లేకపోయింది" అన్నాడు రాజశేఖరం.

"మంత్రగాడితో మీకు పేచీ ఎందుకొచ్చింది?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

"అదంతా ఒక కథ. నేను సుశీలను పెళ్ళిచేసుకుంటానని మోసం చేశాను. సుశీల నన్ను తిట్టి జీవితాంతం నాకు సుఖం లేకుండా ఉంటుందని అంది. మోసం చేసిన పాపానికి ప్రతిఫలం అనుభవిస్తావని తిట్టింది.

నాకు పెళ్ళయింది తర్వాత. ఇద్దరు పిల్లలు పుట్టారు.

ఇద్దరూ చనిపోయారు విచిత్రంగా. ఎన్ని మందులు వాడినా బ్రతికించుకోలేకపోయాను. అలాగే నా భార్య చని పోయింది. నా తండ్రి యాక్సిడెంట్‌లో పోయాడు. అవన్నీ తల్చుకుంటే సుశీల అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆమెకు నేను చేసిన అన్యాయానికి ప్రతి ఫలంగా ఇవన్నీ జరుగుతున్నాయా? అనిపించింది.

కాని లోకంలో ఎందరో ఎన్నో అన్యాయాలు చేస్తు న్నారు. మోసాలూ, ఖూనీలూ చేసి దర్జాగా సుఖపడు తున్నారు. వాటితో పోల్చుకుంటే నేను చేసింది పెద్ద అన్యాయమేం కాదు. తీవ్రంగా ఆలోచించాను. సుశీల గురించి ఎంక్వయిరీ చేశాను. ఆమె హైదరాబాద్‌లో ఉద్యోగం చేసుకుంటూ వుందని తెలిసింది. తర్వాత ఆమెను మర్చిపోయాను.

ఒకరోజున సుశీల మా రెస్టారెంట్‌కు వచ్చింది. కాని నన్ను గమనించలేదు. నాతో పరిచయం లేనట్లే నటిం చింది. అప్పుడామె వెంట ఒక వ్యక్తి వున్నాడు. అతన్ని గురించి ఆరా తీశాను. అతనొక మంత్రగాడని తెలిసింది. అతను సుశీలకు బంధువనిగూడా తెలిసింది.

నాకప్పుడు అనుమానం వేసింది. సుశీల నాపై పగ బట్టి మంత్రగాడి ద్వారా నా భార్యా, బిడ్డలను చంపిం చిందని వూహించాను.

మొదట అసలు సుశీలనే చంపాలనుకున్నాను. కాని మంత్రగాడు అసలు హంతకుడు. వాడు బ్రతికుంటే ఇంకా ఎందరికో హాని చేస్తాడు. అందుకని బంగారయ్య ద్వారా ముందుగా వాళ్ళని చంపించాను" అంటూ వివ రంగా చెప్పుకొచ్చాడు రాజశేఖరం.

"సుశీల మీ భార్య పిల్లల్ని చంపించింది మంత్రగాడి ద్వారా అనేది మీ అనుమానం. అందుకు ఆధారం యేదయినా వుందా?"

"ఇంకేం ఆధారం కావాలి. సుశీలకు అతను బంధువు"

"అది సరే! మీ అనుమానానికి నిర్దిష్టమైన ఆధారం యేమీ లేదు. మీ భార్య పిల్లలు మరణించడానికి మంత్రగాడు కారణం కాకపోవచ్చును కదా!"

"కావచ్చు. కాని నాకు జరిగిన వాటినిబట్టి అటువంటి నమ్మకం కలిగింది. నా మనశ్శాంతి కోసం వాళ్ళని హత్య చేయించాను" అన్నాడు రాజశేఖరం తలవంచుకుంటూ.

—: ఐపోయింది :—

# ఫోన్ నెంబరు పన్నెండు!

ప్రతాప రవిశంకర్

పరాంకుశానికి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచాడు. ఎదురుగా గదిగోడలు కనిపించాయి. గదిలో దీపం మసకగా వెలుగుతోంది.

లేచి కూర్చున్నాడు.

అటకమీద చప్పుడవుతోంది.

టకా....టకా....

"వెధవ ఎలుకలు" పెద్దగానే విసుగ్గా అన్నాడు పరాంకుశం.

ఆ ఎలుకలు చేస్తున్న చప్పుళ్ళకే అతనికి మెలకువ వచ్చింది.

చిన్నగా నోటితో శబ్దం చేశాడు. ఆ చప్పుళ్ళు వెంటనే ఆగిపోయాయి. రెండు నిమిషాలు గడిచాక మళ్ళీ మొదలయినాయి.

పరాంకుశానికి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. అరిచినప్పుడు అవి చప్పుడు చెయ్యటం ఆపుతున్నాయి. తిరు

వాత మళ్ళీ మొదలు పెడుతున్నాయి. ఆ చప్పుళ్ళకు నిద్రపట్టడంలేదు.

రోజూ ఇదే గొడవ.

పక్కనే పడుకున్న భార్యను చూశాడు పరాంకుశం. ఆమె హాయిగా నిద్రపోతోంది.గుండెల మీద పమిటలేదు. అసలు ఆమెకు జాకెట్టేలేదు.

నవ్వుకున్నాడు అతను. 'అదృష్టవంతురాలు. ఏ చప్పుళ్ళకీ నిద్రలేవదు' అనుకున్నాడు.

పైన ఎలుకలు చప్పుళ్ళు చేస్తూనే వున్నాయి.

అతనికేమీ తోచక భార్య మాలతిని నిద్రలేపాడు.

"ఎందుకు లేపారు?" అన్నది మాలతి లేచికూర్చుని.

"పైన ఎలుకలు గొడవ చేస్తున్నాయి. నాకు నిద్ర పట్టడంలేదు" అన్నాడతను.

"అయితే నా నిద్రకూడా పాడుచేసి నన్ను లేపటం యెందుకు?" అన్నదామె నవ్వుతూ.

"నువ్వు సుఖంగా నిద్రపోవటం చూడలేక పోయాననులే. ఆ చప్పుళ్ళు ఆగిపోవడానికి ఏదయినా ఉపాయం చెప్పు" అన్నాడు.

"పైకి ఎక్కి ఎలుకల్ని పట్టండి" అన్నది నవ్వి.

"జోక్‌గా కాదు. నిజంగా చెప్పు" అన్నాడు.

"ఈ రాత్రికి యెలాగో పడుకోండి! తెల్లారి యెవరినయినా అటక ఎక్కించి పైనున్న ఆ చెత్తంతా తీసేయిద్దాం" అన్నది.

"ఆ అయిడియా బాగానే వుంది. కాని దీన్ని తెల్లారినదాగా వాయిదా వెయ్యటానికి వీల్లేదు. ఇప్పుడే ఆ చెత్త అంతా తీసెయ్యాలి" అని లేచి నిలబడ్డాడు పరాంకుశం.

మాలతి అతని చెయ్యి పట్టుకుని "అర్ధరాత్రిపూట

ఏమిటీ పని. ఈ రాత్రికి ఎలాగో నిద్రపోండి. ఇప్పుడు అటకమీదకు ఎక్కొద్దు" అన్నది.

"ఎంత సేపు? గంటలో అంతా అయిపోతుంది. చూస్తాండు" అని ఆ గది తలుపులు తెరుచుకొని బయటకు వెళ్ళి నిముషం తర్వాత నిచ్చెనను లోపలకు తీసుకు వచ్చి గోడకు వేశాడు.

"మీకీ ఆలోచన చెప్పటం పొరపాటయింది. బంగారం లాంటి నిద్ర చెడగొట్టారు" అన్నది మాలతి లైటువేసి.

"ఫర్వాలేదులే. పొద్దుట పాలు నేను పోయించు కుంటాను. నువ్వు ఒకగంట ఎక్కువసేపు పడుకో" అన్నాడు నిచ్చెనమెట్లు ఎక్కుతూ.

"జాగ్రత్త.... పైన పురుగు పుట్రా వుంటాయేమో."

"పురుగు పుట్రా వుంటే మనకేం ప్రమాదంలేదు. ఈ ఎలుకలతోటే మనకు ప్రమాదం" అని నిచ్చెన చివరకు వెళ్ళి చప్పుడు చేశాడు నోటితో.

ఎలుకలు అటూయిటూ పరుగుదీశాయి.

"ఎద్దుల్లాగా ఉన్నాయి" అన్నాడు అటూయిటూ చూస్తూ.

"తొందరగా దించండి ఆ పెట్టెలు" అన్నది మాలతి పైకిచూస్తూ.

అతను ఇంకో మెట్టు యెక్కి అందుబాటులోనున్న ఓ చెక్కపెట్టెను ఇవతలకు లాగాడు. అది బాగా తేలికగా వుంది. దాన్ని ఒకచేత్తో పట్టుకుని "ఇదిగో.... దీన్ని అందుకో" అన్నాడు.

మాలతి మంచం మీదకు ఎక్కి ఆ పెట్టెను అందుకుని "దీంట్లో యేమీలేవు. అంతా దుమ్మూ, బూజు" అన్నది.

ఈలోపల పరాంకుశం ఇంకో పెట్టెను దగ్గరకు లాక్కు

న్నాడు. అది కొంచెం బరువుగా వుంది. దాన్నికూడా మాలతికి అందించాడు.

"ఇందులో ఖాళీ మందుసీసాలు ఉన్నాయి. రేపు పాతసీసాలు కొనేవాడొస్తే పిలవండి. ఈ సీసాలన్నీ అమ్మితే మీరు పడుతున్న శ్రమకు ప్రతిఫలం వుంటుంది" అన్నది మాలతి నవ్వి.

"నువ్వు అర్ధరాత్రిపూట జోకులెయ్యకు. నేను పాత సీసా లమ్ముకోవటానికి ఇవన్నీ దించుతున్నానా. ఇదిగో.. ఇదికూడా అందుకో" అన్నాడు ఇంకో పెట్టెను చేత్తో పట్టుకుని.

ఆమె దాన్నికూడా దించి "దీన్నిండా వుంది చెత్త. అన్నీ పాతకాయితాలు, పుస్తకాలు .... వీటినికూడా ఎందుకో ఇంత జాగ్రత్తగా అటకమీద దాచారు" అన్నది.

"నీలాగా పాతకాయితాల వాడికి అమ్ముకోటం ఆ మహా ఇల్లాలెవరికో తెలిసివుండదు....ఇదిగో! ఈ ఒక్క దాన్నే అందుకో....ఇదే లాస్టు" అన్నాడు పరాంకుశం.

అందుకుంది మాలతి. ఆ చెక్కపెట్టె బాగానే తేలికగా వుంది. దానిలో ఏవో బట్టలున్నాయి.

"పాతబట్టల్ని కూడా పైన పారెయ్యడం ఎందుకో" అని ఆ బట్టల్ని పైకతీసింది మాలతి.

వెంటనే అందులోనించి ఏదో కిందపడి ఖంగుమని మోగింది.

"ఏమిటది?" అన్నాడు పరాంకుశం నిచ్చెన దిగి.

"ఏమో మంచం కిందకు వెళ్ళింది" అని ఒంగిచూసి ఆశ్చర్యంతో చిన్నగా అరిచింది.

"ఏమిటి?" అంటూ అతనుకూడా ఒంగిచూసి "మై

గాడ్....రివాల్వర్" అన్నాడు.

మాలతి అతనికేసి భయంగా చూసింది.

"రియల్లీ వండర్. ఆ పాతబట్టల పెట్టెలో రివాల్వర్ ఉండడం ఏమిటి? అసలు ఈ బట్టలు యెవరివో. కొంప దీసి ఇవి ఏదయినా హత్యకు సంబంధించినవేమో!" అన్నాడు.

ప్యాంటు, ఫుల్ షర్టు, బనీను....ప్యాంటుకు, షర్టుకు అక్కడక్కడ నెత్తురు మరకలు కనిపించాయి. "ఇదిగో చూడు ఇవి నెత్తురు మరకలు" అన్నాడు అతను చిన్నగా.

"అవును" అన్నది వాటిని చూసి.

తర్వాత "ఈ బట్టలు ఖూనీ చేసిన వాడివి అయుంటాయి" అన్నది.

"తప్పకుండా ఖూనీ చేసినవాడివే. అయితే ఖూనీ చేసింది ఎవరు? ఎవర్ని ఖూనీ చేశారు?" అన్నాడు ఆలోచిస్తూ.

"నన్నడుగుతారేం. నాకు అసలే భయంగా వుంది" అన్నది మాలతి బెదురుతున్న కళ్ళతో.

"భయపడకు. నిజానికి నా కూడా భయంగానే వుంది. ఈ బట్టల్ని, ఈ రివాల్వర్‌ని ఎవరయినా చూడటము జరిగిందంటే నేనే ఎవర్నో హత్యచేసి వీటిని దాచి పెట్టానని అంటారు" అన్నాడు.

"అందుకని ఒకపని చేద్దాం. వీటిని ఇలాగే పైన పారేద్దాం" అన్నది.

"నీ ప్లాను బాగానే వుంది. కాని చిన్న లోపముంది. వీటిని ఇలా దాచిపెట్టడం వల్ల అసలు హంతకుడు బయట

ప్రపంచంలో హాయిగా తిరుగుతూ వుంటాడు. వాడు మరి కొన్ని హత్యలు చేసే అవకాశం వుంది. మనం హంతకుడ్ని అలా వదిలెయ్యకూడదు. కాబట్టి వీటిని పోలీసులకు అప్పగించాలి" అన్నాడు మంచంమీద కూర్చుని.

"అలా చేస్తే ఈ కేసు మన నెత్తికి చుట్టుకుంటుందేమో. అసలే పోలీసులు అనుమానస్తులు. వాళ్ళు సులభంగా కేసు ముగించే ఉపాయం చూస్తారు. ఈ హత్యను మనమే చేశామని చివరికి మనల్నే ఇరుకున పెడతారేమో" అన్నది మాలతి కంగారుగా.

"శాంతించు మాలా.... నాకో ఆలోచన వచ్చింది. మనం ఈ బట్టల్ని రివాల్వర్‌ని ఈ నగరంలోనే వున్న ప్రముఖ డిటెక్టివ్ జగదీష్ దగ్గరకు తీసుకెళదాం. జరిగినదంతా ఆయనతో చెబుదాం. తర్వాత ఆయన చెప్పిన ప్రకారం చేద్దాం" అన్నాడు గబుక్కున.

"ప్రయివేటు డిటెక్టివా? ఆయనకు మనం ఫీజు ఇచ్చుకోవద్దూ?" అన్నది మాలతి.

"అవసరం లేదు. ఎందుకంటే ఇది మనకు సంబంధించిన కేసు కాదు. అంతేకాదు హంతకుల్ని పట్టుకోవడం అతని లక్ష్యం. ఇంతకుముందు అతను ఫీజు తీసుకోకుండా ఎన్నో కేసులని పరిశోధించాడు. కాబట్టి ఇప్పుడే మనం జగదీష్ దగ్గరకు వెళదాం" అన్నాడు పరాంకుశం.

"ఇప్పుడా? ఈ అర్థరాత్రివేళా? మీకేమయినా మతిపోయిందా?" అన్నది.

"సరే.... తెల్లవారిన తర్వాత వెళదాం. ఇక మనం పడుకుందాం" అన్నాడు.

"ఇక నాకు నిద్రపట్టి చావదు. గుండెల్లో భయంగా వుంది. ఇంక నిద్ర ఎలా వస్తుంది. తెల్లవార్లూ యిలా

మెలకువతో ఉండాల్సిందే" అన్నది దిగులుగా.

పరాంకుశం మాట్లాడలేదు. కర్చీఫ్‌తో జాగ్రత్తగా మంచంకింద నుంచి రివాల్వర్‌ని తీసి ఆ చెక్కపెట్టెలో పడేశాడు.

"ఎందుకు కర్చీఫ్‌తో పట్టుకున్నారు?" అన్నది.

"దీనిమీద హంతకుడి వేలిముద్రలు వుండొచ్చు. వాటి మీద నా వేలిముద్రలు పడకుండా జాగ్రత్తపడ్డాను" అన్నాడు గర్వంగా.

"ఇవన్నీ మీకెలా తెలుసు?" అన్నది మాలతి ఆశ్చర్యంగా.

"నేను అపరాధ పరిశోధన చదువుతాను. అది చదివితే ఇలాంటి విషయాలన్నీ తెలుస్తాయి" అన్నాడతను.

తర్వాత ఆ బట్టల్ని పైకెత్తి ప్యాంటు, షర్టుజేబులో చెయ్యిపెట్టి వెతికాడు. ప్యాంటు వెనుక జేబులో చిన్న కాయితం దొరికింది. దానిమీద 'ఫోన్ నెంబరు పన్నెండు' అని ఎర్రటి అక్షరాలు కనిపించాయి.

"హంతకుడు తప్పకుండా దొరుకుతాడు" అన్నాడు పరాంకుశం సంతోషంగా.

"ఎలా?" అన్నది మాలతి.

"డిటెక్టివ్ పరిశోధన ముందుకు సాగటానికి తగిన క్లూ దొరికింది. ఫోన్ నెంబరు పన్నెండు" అన్నాడు పరాంకుశం ఆ కాయితాన్ని ప్యాంటుజేబులో వుంచుతూ.

మాలతి చిన్నగా నిట్టూర్పు విడిచి పరాంకుశం వైపు చిత్రంగా చూసింది.

## 2

'డిటెక్టివ్ డైజెస్టు' ఇంగ్లీషు మంత్లీ మేగజైన్ చూస్తున్నాను. గభాలున ఓ మనిషి డోర్ నెట్టుకుని

లోపలకు వచ్చి "నమస్కారం సార్. నా పేరు పరాంకుశం" అన్నాడు.

"రండి కూర్చోండి" అన్నాను.

"ఒక్క నిముషం" అని అతను బయటకు వెళ్ళిపోయాడు.

రెండు నిముషాల తర్వాత అతను ఓ చెక్క పెట్టెలో లోపలకు వచ్చాడు. దానికేసి ఆశ్చర్యంగా చూశాను. అతని పక్కనే ఓ అందమైన యువతి వుంది. అతని భార్య.

చెక్క పెట్టెను కుర్చీ పక్కనే వుంచి "ఈమె నా భార్య మాలతి" అన్నాడు.

మాలతి నాకు నమస్కారం చేసింది తడబడుతూ.

"ఇద్దరూ కూర్చోండి" అన్నాను సిగరెట్టు వెలిగిస్తూ.

ఆమె సిగ్గుపడుతూ కూర్చున్నది. ఆమె చూపులు సూటిగా నా మీదకే ఉన్నాయి. అయినా ఆ మొహంలో కంగారు, కొంచెం భయం కనిపిస్తూనే ఉన్నాయి.

"నేను బి.హెచ్.ఇ.యల్.లో పనిచేస్తున్నాను. కాపురం రామ్‌నగర్‌లో. ఈ మధ్యనే—అంటే నెలక్రితం మేము విద్యానగర్ నించి ప్రస్తుతం వుంటున్న ఇంట్లోకి మారాము. ఇల్లు బాగానే వుంది. కాని రాత్రే...." అని ఆగిపోయాడు.

"ఆ.... రాత్రి ఏం జరిగింది?" కుతూహలంగా ముందుకు వంగి అడిగాను.

"చెప్పండి" అన్నది మాలతి.

"ఎలుకల గొడవ పడలేక అర రాత్రి అటకమీదకు ఎక్కి ఈ చెక్క పెట్టెను దించితే అందులో యివి దొరికాయి" అంటూ ఆ పెట్టెను టేబిల్ మీద ఉంచి

అందులోనించి నెత్తురు బట్టలు—రివాల్వర్ తీసి చూపించాడు.

వాటికేసి పరీక్షగా చూశాను. అందులో ఎటువంటి సందేహంలేదు. అవి తప్పకుండా హంతకుడి బట్టలు-అతని రివాల్వర్-హత్యాయుధం....

"జరిగింది వివరంగా చెప్పండి" అన్నాను అతనితో.

"చెబుతాను" అని అతను మధ్య మధ్యలో భార్య కేసి చూస్తూ జరిగినదంతా చెప్పేశాడు.

కొంచెంసేపు నేను మాట్లాడలేకపోయాను.

ఆలోచిస్తూ ఉండిపోయాను.

ఒకరకంగా ఆలోచిస్తే హంతకుడు తెలివితక్కువ వాడుగా కనిపిస్తున్నాడు. లేకపోతే శవాన్ని దాచి ఉంచిన చోటునే ఈ బట్టల్ని, హత్యాయుధాన్ని దాచి వుంచవచ్చు. కాని అలా జరగలేదు. కాబట్టి అతని బాధ్యత హత్య చెయ్యటం వరకే. శవాన్ని మాయం చెయ్యటం మరొకరి పని అయివుంటుంది.

"చెప్పండి జగదీష్‌గారూ. ఇప్పుడు మమ్మల్ని ఏం చెయ్యమంటారు? ఈ బట్టల్ని, రివాల్వర్‌నీ పోలీసులకు అప్పగించమంటారా?" అని అడిగాడు పరాంకుశం.

"అప్పగించక తప్పదు. ఇది పోలీసులు పరిశోధించాల్సిన కేసు. నేరస్తులను పట్టుకోవటం చట్టపరంగా పోలీసు శాఖ బాధ్యత. ప్రయివేటు డిటెక్టివ్‌లు వ్యక్తుల తరఫున పనిచేస్తారు. అంతమాత్రాన ఇలాంటి హత్య కేసులలో పోలీసుల ప్రమేయం లేకుండా ఏదీ జరగటానికి వీల్లేదు. అందుకని ఈ బట్టలను—రివాల్వర్‌ని పోలీసులకు అప్పగించి మీరు రిపోర్టు యివ్వక తప్పదు" అన్నాను.

"ఈ విషయం గురించి మాలతి భయపడుతోంది"

అన్నాడు పరంకుశం భార్యను చూపించి.

"ఎందుకు?"

"పోలీసులు మమ్మల్నే అనుమానిస్తే?"

నవ్వొచ్చింది. నిజమే. పోలీసుల గురించి పబ్లిక్‌లో ఇటువంటి భయమే ఎక్కువ ఉంది. అందుకే ఏదయినా జరుగుతున్నప్పుడు చూసినా పోలీసుల దగ్గరకు వెళ్ళి తెలియజేయరు.

"మీరు అలా భయపడాల్సిన అవసరంలేదు. పోలీసులు మిమ్మల్ని అనుమానించరు. అలా అనుమానించకుండా నేను చూస్తాను. మీరు పోలీసులకు రిపోర్టు యివ్వటం ద్వారా వాళ్ళకు సహకరిస్తున్నారు.

ఒక హంతకుడిని చట్టానికి పట్టిస్తున్నారు. ఇంకో విషయం ఈ హత్యకేసును నేను కూడా పరిశోధిస్తాను. హంతకుడిని పట్టుకుంటాను" అన్నాను.

"థాంక్స్ జగదీష్‌గారూ. మీరు తప్పకుండా యీ హత్యకేసును పరిశోధించటానికి ఒప్పుకుంటారనే ధైర్యంతోనే మీ దగ్గరకు వచ్చాము. లేకపోతే ఈ పెట్టెను మళ్ళీ అటకమీద పడేసి ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయే వాళ్ళం" పరాంకుశం.

నవ్వి "న్యాయంగా ఎవరయినా అలాగే చేస్తారు. అందుకే హంతకుడు అంత ధైర్యంగా తన బట్టలను—రివాల్వర్‌ని ఇందులో పెట్టి వెళ్ళిపోయాడు. ఇంకో విషయం మీరు అటకమీదనించి దించిన మిగిలిన మూడు పెట్టెలూ అలాగే వున్నాయా?" అని అడిగాను.

"ఉన్నాయండీ. ఎందుకయినా మంచిదని వాటిని పారెయ్యాలేదు" అన్నది మాలతి.

"గుడ్. వాటిని జాగ్రత్తగా ఉంచండి. నేను వాటిని

చూడాలి" అన్నాను.

ఉన్నట్టుండి పరాంకుశం "మరచిపోయాను" అన్నాడు.

"ఏమిటి?" అన్నాను.

"ఈ ప్యాంటు జేబులో ఓ చిన్న కాయితం వుంది" అని ఆ నెత్తురు మరకల ప్యాంటు జేబులోనించి ఓ కాయితాన్ని తీసి నా చేతికిచ్చాడు.

దానిమీద 'ఫోన్ నెంబర్ పన్నెండు' అని ఎర్రటి అక్షరాలు వున్నాయి.

"థాంక్స్ పరాంకుశంగారూ. హంతకుడిని పట్టుకోవటానికి ఈ మాత్రం క్లూ చాలు. దీని ఆధారంతో, అతను ఎక్కడ దాక్కున్నా పట్టుకోవచ్చు" అన్నాను గట్టిగా.

ఆ మాటలతో పరాంకుశం గర్వంగా భార్యకేసి చూశాడు.

"మీ ఎడ్రసు ఇవ్వండి" అన్నాను.

పెన్ని-చిన్న డైరీని అతని కిచ్చాను. దాన్లో అతను తన ఎడ్రసు రాశాడు.

"ఇక మేము పోలీసు స్టేషన్‌కు వెళతాము" అన్నాడు పరాంకుశం.

"ఒక్క నిమిషం ఆగండి" అని ఫోన్ రిసీవర్ ఎత్తి డయల్ చేశాను.

అవతలి వైపు నించి ఇన్‌స్పెక్టర్ ప్రదీప్ గొంతు వినిపించింది.

"హలో ప్రదీప్. నేను జగదీష్‌ను" అన్నాను.

"నువ్వా. ఏమిటీ ఇంత పొద్దుటే ఫోన్ చేశావ్? ఏదయినా విశేషం వుందా?" నవ్వుతూ అడిగాడు.

"అవును. ఎక్కడో ఎప్పుడో హత్య జరిగింది. ఇప్పుడు ఒక యింట్లో అటకమీద హంతకుడి నెత్తురు బట్టలు—

ఓ రివాల్వర్ —ఫోన్ నెంబర్ పన్నెండు అనే ఓ చిన్న కాయితం దొరికాయి. ఈ బట్టలు దొరికిన ఇంట్లో ప్రస్తుతం పరాంకుశం అనే అతను భార్యతో అద్దెకు వుంటున్నాడు. ఇప్పుడు వారిద్దరూ నా దగ్గరే వున్నారు. నీ దగ్గరకు పంపిస్తున్నాను. వాళ్ళ దగ్గర రిపోర్టు తీసుకో. తర్వాత నిన్ను కలుస్తాను" అన్నాను.

"అలాగే. స్టేషన్లోనే వుంటాను. వెంటనే పంపించు. కేసుల్లేక చాలా బోర్ కొడుతోంది. అందులో హత్య కేసు తగిలి చాలా రోజులయ్యింది" అన్నాడు నవ్వుతూ.

ఫోన్ పెట్టేశాను.

"ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు పరాంకుశంతో.

"థాంక్స్ జగదీష్‌గారూ. వెళ్ళొస్తాం" అని నమస్కారంచేసి ఆ చెక్కపెట్టె తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు పరాంకుశం. అతని వెనుకే నడిచింది మాలతి.

కుర్చీలో వెనక్కి వాలాను సిగరెట్టు వెలిగించి.

# 3

"ఇన్‌స్పెక్టర్ గారు వున్నారా?" పోలీస్ స్టేషన్ బయట నిలబడివున్న కానిస్టేబుల్‌ని అడిగిందా యువతి.

ఆమె ఎర్రగా వుంది—పొడుగ్గా ఉంది. పొడుగాటి వాలుజడ. వాయిలు చీర కట్టుకుంది. నుదుటిమీద పెద్ద ఎర్రటి తిలకంబొట్టు చరుచుకున్నదానిలా వుంది.

"ఎందుకు" అడిగాడు కానిస్టేబుల్.

"పనుంది. ఆయనతో మాట్లాడాలి."

"లోపలకు వెళ్ళండి" అన్నాడు కానిస్టేబుల్.

ఆమె లోపలకు వెళ్ళి ఏదో రాసుకుంటున్న ఇన్‌స్పెక్టర్ ప్రదీప్‌కు నమస్కారం చేసింది.

"కూర్చోండి" అన్నాడతను.

అతని ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నది.

"నా పేరు శివలీల" అన్నది.

"చెప్పండి" అన్నాడు కుతూహలంగా.

"నాకు ఓ అక్కయ్య ఉంది. ఆమె ఆరునెల్ల క్రితం ఇంట్లోనించి వెళ్ళిపోయింది. ఎక్కడికి వెళ్ళిపోయిందో మా కెవ్వరికీ తెలీదు. రెండు నెలల క్రితం అక్కయ్య ఈ వూళ్ళో కనిపించిందని ఇక్కడే వుంటున్న నా స్నేహితు రాలు ఓ ఉత్తరం రాసింది. ఇక్కడకు వచ్చాను. ఇక్కడకు వచ్చిన వారం రోజుల తర్వాత అక్కయ్య ఓ రోజు సాయంత్రం ఆరుగంటలప్పుడు కోఠీసెంటర్లో ఓ షాపు ముందు మోటారు సైకిలు పక్కన నిలబడి కనిపించింది. నన్ను చూడగానే కలవరపడింది. నేనే పలకరించాను. ఇంట్లోనించి ఎందుకు వచ్చేశావని అడిగాను. చెప్పలేదు. మేమిద్దరం మాట్లాడుతూ ఉండగా షాపులోనించి ఒకతను బయటకు వచ్చాడు. అతను సన్నగా-పొడుగ్గా ఉన్నాడు. నన్ను చూసి ఆశ్చర్యపడ్డాడు. నేను కూడా మా అక్కలాగే ఉంటాను.

"ఎవరీ అమ్మాయి నీ చెల్లెలా?" అని అడిగాను.

అవునని తల వూపింది.

"అచ్చం నీలాగే ఉంది" అన్నాడు సిగరెట్టు వెలిగిస్తూ.

అక్కయ్య మాట్లాడలేదు.

"మన ఇంటికి తీసుకెళదామా?" అని అడిగాడు అక్కయ్యను.

"వద్దు. ముందు మనం ఇక్కడినించి వెళ్ళిపోదాం" అన్నది.

"నీతో మాట్లాడాలి అక్కయ్యా. అమ్మ నీ కోసం

ఏడుస్తోంది" అన్నాను.

అది వినిపించుకోలేదు. అతన్ని మోటారుసైకిల్ని స్టార్టు చెయ్యమని తొందర చేసింది. అతను స్టార్టు చేశాడు అయిష్టంగానే. అతను ఎక్కగానే తను కూడా ఎక్కి "ఇంటికెళ్ళిపో" అన్నది. ఆ మోటార్ సైకిల్ వెళ్ళి పోయింది. అంతే—

అప్పటినించి ఇప్పటివరకు అక్కయ్య మళ్ళీ నాకు కనిపించలేదు. నాకెందుకో అనుమానంగా వుంది. అక్కయ్య ఏమయ్యిందో తెలీదు. అందుకే మీ దగ్గరకు వచ్చాను. దయచేసి నా అక్కయ్య గురించి ఆరా తియ్యండి. అది ఎక్కడ వున్నదో తెలుసుకోండి. ఎక్కడున్నా అది క్షేమంగా ఉంటే చాలు" అన్నది శివలీల ప్రాధేయ పడుతున్నట్టు.

తల వూపాడు ఇన్‌స్పెక్టర్ ప్రదీప్.

తర్వాత "మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడుగుతాను. వివరంగా జవాబులు చెప్పండి" అన్నాడు.

"అడగండి. కంగారులో సరిగా చెప్పడం కుదర లేదు" అన్నది శివలీల.

"మీదే వూరు?"

"కాంజీ పేట."

"తల్లి తండ్రీ అక్కడే ఉంటున్నారా?"

"మా నాన్న లేడు. పదేళ్ళ క్రితమే పోయాడు. అమ్మ మేమిద్దరమే అక్కడ వుండేది. అక్కయ్య- నేనే. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు లేరు."

"మీ అక్కయ్య ఎంతవరకు చదువుకుంది?"

"బియ్యే పాసయింది."

"మీ వూళ్ళో ఏదయినా ఉద్యోగం చేసేదా?"

"అవును. ఒక కాన్వెంట్‌లో టీచర్‌గా పనిచేసేది. ఇంట్లోనించి వెళ్ళిపోయేముందు వరకు పనిచేస్తూనే ఉంది."

"మీ అక్కయ్య పేరు చెప్పలేదు మీరు."

"సారీ. మనోరమ."

"మనోరమ ఒంటరిగానే ఇల్లు వదిలి వెళ్ళిపోయిందా?"

"అంటే."

"ఇలా అడుగుతున్నందుకు అపార్థం చేసుకోవద్దు. ఒక వేళ మీ అక్కయ్య యెవర్నయినా ప్రేమించి వుంటే అతనితో కలిసి ఇంట్లోనించి వెళ్ళిపోయిందేమోనని."

"మా అక్కయ్య మా వూళ్ళో ఎవర్నీ ప్రేమించ లేదు. ఆ విషయం నాకు బాగా తెలుసు. అది ఒంటరిగానే వెళ్ళిపోయింది."

"వెళ్ళిపోయేముందు ఆమె ప్రవర్తన ఎలా ఉంది?"

"మీ ప్రశ్న నాకర్థం కాలేదు" అన్నది శివలీల.

"ఇంట్లోనించి వెళ్ళిపోవటానికి రెండు మూడు రోజుల ముందు మీ అక్కయ్య విచారంగా గానీ, బాగా సంతోషంగా గానీ ఉందా?"

"అవును. అసలు విషయం చెప్పటం మరిచిపోయాను. అక్కయ్య యింట్లోనించి వెళ్ళిపోవటానికి రెండు రోజుల ముందు అక్కయ్య పేరున ఓ కవరు వచ్చింది. ఎక్కడి నించి అని అడిగాను. ముందు అది చెప్పలేదు. తర్వాత తనతో చదివిన ఓ అమ్మాయి విజయవాడనించి రాసిందని చెప్పింది. చించేసిన కవరును అది కిటికీలోనించి బయట పడేసింది.

నాకు అనుమానం వచ్చింది. సాధారణంగా ఏదయినా ఉత్తరం వస్తే అది చదివిన తర్వాత ఆ ఉత్తరాన్ని చదవటానికి నాకు ఇస్తుంది. కాని ఆ రోజు వచ్చిన ఉత్తరాన్ని

అది నాకు ఇవ్వలేదు. అందుకే బయటకి వెళ్ళి పారేసిన కవరును తీసుకొని చూశాను. దానిమీద హైదరాబాదు పోస్టల్ ముద్ర ఉంది. అక్కయ్య నాకు అబద్ధం చెప్పిందని గ్రహించాను. అయినా దాన్ని అడగదల్చుకోలేదు. మనసులోనే బాధపడ్డాను. ఆ తర్వాత రెండు రోజులకే అక్కయ్య ఇంట్లోనించి వెళ్ళిపోయింది."

ప్రదీప్ నిమిషంసేపు మాట్లాడలేదు. తర్వాత "మీ అక్కయ్య ప్రవర్తన ఎటువంటిది?" అనడిగాడు.

"నాకు తెలిసినంతవరకు చాలా మంచిది. కాని అది ఇంట్లోనించి వెళ్ళిపోవటమే నాకు అనుమానాన్ని కలిగిస్తోంది. హైదరాబాద్ నించి ఆ ఉత్తరం వచ్చిన తర్వాతనే అది ఇల్లువదిలి వెళ్ళిపోయింది. బహుశా ఏ మగవాడో దానికి ఉత్తరం రాసి వుండాలి" అన్నదామె మొహానికి పట్టిన చెమటను పమిటతో తుడుచుకొంటూ.

"ఆ ఉత్తరం ఓ మగవాడి దగ్గర్నించే వచ్చిందని ఎలా చెప్పగలవు?" అడిగాడు ప్రదీప్ సిగరెట్టు ముట్టించబోతూ.

"అలా కాకుండా ఉంటే అక్కయ్య నాకు ఆ ఉత్తరాన్ని చూపించేది."

"చెప్పలేము. ఆ ఉత్తరాన్ని రాసివుండవచ్చు. ఇప్పుడు మీ దగ్గర ఆ ఖాళీ కవరు ఉన్నదా?"

"ఉంది. ఎందుకయినా పనికొస్తుందని తీసుకొచ్చాను" అని శివలీల హ్యాండుబ్యాగ్ లోనించి ఓ ఎరుపురంగు కవర్ని బయటకి తీసి ఇన్ స్పెక్టర్ కి ఇచ్చింది.

ఆ కవరుమీద మనోరమ పేరు, ఎడ్రసు ఇంగ్లీషులో గుండ్రటి అక్షరాలతో రాసి వుంది.

"ఈ దస్తూరి మగవాళ్ళది కాదు" అన్నాడు ఇన్

స్పెక్టర్ వెంటనే.

"కాదా!?" అన్నది శివలీల ఆశ్చర్యంగా.

"కాదు. ఈ దస్తూరి ఓ అమ్మాయిది."

"అయితే ఈ దస్తూరి తప్పకుండా రత్నకుమారిదే అయివుండాలి" అన్నది శివలీల.

"రత్నకుమారి ఎవరు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రత్నకుమారి అక్కయ్య క్లాసుమేటు. నాకు అంతగా పరిచయం లేదు. ఇప్పుడు యిక్కడే యెక్కడో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తోంది స్టెనోగా. ఇంతకుముందు ఏవో పరీక్షలు రాయటానికి అక్కయ్య ఈ వూరు వచ్చినప్పుడు రత్నకుమారి రూములోనే వున్నది. ఈ వూళ్లో అక్కయ్యకు బాగా తెలిసింది ఒక్క రత్నకుమారే" అన్నది.

"మీరు రత్నకుమారిని కలుసుకోలేదా?"

"ఆమె గదికి వెళ్ళాను. కాని అప్పటికి నెలరోజుల క్రితమే ఆమె ఆ గది ఖాళీచేసి వెళ్ళిపోయిందిట. ఎక్కడికి వెళ్ళిందో ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఆమె ఎక్కడ పని చేస్తున్నదో వాళ్ళకు తెలీదు."

ఇన్‌స్పెక్టర్ ప్రదీప్ ఏదో అడగబోయాడు. ఇంతలోనే ఫోన్ మోగింది.

రిసీవర్ ఎత్తి "ప్రదీప్ హియర్" అన్నాడు.

అటుప్రక్క డిటెక్టివ్ జగదీష్ మాట్లాడాడు.

"జగదీష్! వెంటనే బయల్దేరి రా. మరోకేసు వచ్చింది. మనోరమ అనే అమ్మాయి కాజీపేటనుంచి ఇక్కడకువచ్చి మాయమయ్యింది. ఆమె గురించి ఆమె చెల్లెలు వచ్చింది. ఇప్పుడు ఇక్కడే వున్నది. నువ్వుకూడా

వస్తే బాగుంటుంది" అన్నాడు.

"ఓ.కే. ఇప్పుడే బయల్దేరుతున్నాను" వినిపించింది ఫోన్‌లో.

ఫోన్ పెట్టేశాడు ఇన్‌స్పెక్టర్.

"ఎవరికి నా విషయం చెప్పారు?" అని అడిగింది శివలీల.

"డిటెక్టివ్ జగదీష్‌కి. అతను నా క్లాసుమేట్. ఏ కేసునయినా అతను సులభంగా పరిశోధిస్తాడు. అతను ఇప్పుడు ఇక్కడకు వస్తున్నాడు. ఇద్దరం త్వరలోనే మీ అక్కయ్య జాడ తెలుసుకుంటాం. మీ అక్కయ్య ఫోటో ఒకటి వుందా?" అనడిగాడు.

"ఉన్నది" అంటూ శివలీల హ్యాండుబాగ్‌లోనించి పాస్‌పోర్టుసైజు ఫోటో తీసి ఇచ్చింది.

ఇన్‌స్పెక్టర్ ఆ ఫోటోని తదేకంగాచూసి "నిజమే. మీరు చెప్పకపోతే ఈ ఫోటోలో వున్నది మీ రేనని అనుకునే వాడిని. ఇద్దరూ ఒకేలా వున్నారు" అన్నాడు.

మాట్లాడలేదు శివలీల. ఆమె మొహం విషాదంగా మారింది.

ఇంతలో స్టేషన్ బయిట స్కూటరాగిన చప్పుడు వినిపించింది.

# 4

ఆ ఇంటిముందు రోడ్డుపక్కగా స్కూటరాపి దిగాను. గేటుమూసి వుంది. అక్కడ ఎవ్వరూ కనిపించలేదు.

ఆ రోడ్డులో అంతగా జనసంచారం లేదు. రోడ్డు మూలమీద చిన్న బడ్డీకొట్టు వున్నది.

గేటు నెట్టాను. తెరుచుకొంది కిర్రుమన్న చప్పుడుతో. ఒక్క నిమిషం అక్కడే నిలబడి ఆ మేడను పరిశీలనగా

చూశాను.

బాగా పాత మేడ అది. ముందు రకరకాల పూల మొక్కలు వున్నాయి. పూల మొక్కల మధ్యనుంచి దారి. ఓ వైపు గ్యారేజ్.

కిటికీ తలుపులు తెరిచే వున్నాయి. అయినా లోపల ఏమీ కనిపించటంలేదు. చీకటిగా వున్నట్టుంది.

ముందుకు నడిచాను.

తలుపులు మూసి వున్నాయి.

కాలింగ్ బెల్ కనిపించింది. నొక్కాను. లోపల యెక్కడో మోగిన చప్పుడు వినిపించింది.

రెండు నిముషాల తర్వాత తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా ముప్ఫయ్యేళ్ళ స్త్రీ నిలబడి వున్నది.

"ఎవరు కావాలి?" అడిగిందామె చిన్నగా.

నేను వెంటనే చెప్పలేదు.

మళ్ళీ అడిగిందామె.

"రాజారావుగారు కావాలి."

"ఆయన వూళ్ళోలేరు. రెండ్రోజుల క్రితం మద్రాసు వెళ్లారు."

"ఎప్పుడు వస్తారు?"

"ఏమో తెలియదు. రాబోయేముందు ఫోన్ చేసి చెబుతారు."

"మద్రాసులో ఆయన ఎక్కడుంటారో చెప్ప గలరా?"

"చెప్పలేను. ఆయన వ్యాపారంమీద వెళ్ళిన మనిషి. ఎక్కడయినా వుండొచ్చు."

"ఆయనతో నేను చాలా ముఖ్యమయిన విషయాలు మాట్లాడాలి" అన్నాను రహస్యంగా అన్నట్టు.

"ఆ విషయాలేవో నాకు చెప్పండి. ఆయన ఫోన్ చేసి నప్పుడు నేను చెబుతాను" అన్నదామె అలాగే నిలబడి.

నేను చిన్నగా నవ్వాను.

"ఎందుకు నవ్వుతున్నారు?" అన్నది.

"ఇంటికి వచ్చిన మనిషిని ఇలా నిలబెట్టి మాట్లాడడం మర్యాద కాదని."

ఆమె మొహం సీరియస్‌గా అయింది. తర్వాత "మీరెవరో నాకు తెలీదు. మీరు క్రొత్తమనిషి. ఆయన ఇంట్లో లేనప్పుడు కూర్చోపెట్టి మాట్లాడలేను" అన్నది.

"మీ ఇంటికి అంతా పాతమనుషులే రావాలంటారా?" అన్నాను మళ్ళీ నవ్వుతూ.

"ముందు ఆ విషయాలేవో చెప్పండి. నాకు ఆరోగ్యం సరిగ్గాలేదు" అన్నది.

"వద్దులెండి. చాలా రహస్యమయిన విషయాలు. ఆయనతోనే చెప్పాలి. మళ్ళీ వస్తాను" అన్నాను వెనక్కి తిరుగుతూ.

"మీ పేరు?" అడిగిందామె.

"నా పేరు కూడా ఆయనతోనే చెబుతాను. అది కూడా రహస్యమే" అన్నాను నవ్వి.

ఆమె వెంటనే తలుపులను మూసింది.

నవ్వుకుంటూ బయటకువచ్చి స్కూటరు స్టార్టుచేశాను.

ఆమె అబద్ధం చెప్పిందని నాకు తెలుసు. రాజారావు ఇంట్లోనే వుండివుంటాడు. ఆమె నాతో మాట్లాడుతున్నప్పుడు పక్కనున్న గది కిటికీ పక్కనే ఎవరోమనిషి నిలబడినట్టు నాకు అస్పష్టంగా కనిపించింది. బహుశః ఆ మనిషి రాజారావు అయివుండవచ్చు. లేకపోతే రాజారావు నిజంగా మద్రాసు వెళ్ళినట్లయితే ఆ మనిషి ఆమె

రహస్య ప్రియుడయి వుండాలి.

స్కూటర్ని ఆ పెద్ద కార్నర్‌లో వున్న బడ్డీకొట్టు ముందు ఆపాను. దిగి కొట్టుదగ్గరకి నడచి ఐదురూపాయల నోటు అతనికి ఇస్తూ "ఒక పనామా ఫిల్టర్ ప్యాకెట్" అన్నాను.

అతను ఇస్తున్నప్పుడు "ఆ మేడలో వుండే రాజారావు తెలుసా?" అని అడిగాను.

"తెలీదు సార్!" అన్నాడతను.

"తెలీదా? ఆయన ఎన్నేళ్ళనుంచో ఆ మేడలో వుంటున్నాడు. ఆ మేడ ఆయన సొంతమే" అన్నాను.

"ఏమో. నేను ఇక్కడ ఈ బడ్డీ పెట్టి కొద్దిరోజులే అయింది" అన్నాడు.

నిరుత్సాహమనిపించింది.

పరిశోధన ముందుకు సాగటం లేదు. ఈ రాజారావు యెవరో కాదు. ఫోన్ నెంబరు పన్నెండు యజమాని. రాజారావు ఫోన్ నెంబరే పన్నెండు. అక్కడినుంచే నా పరిశోధన మొదలుపెడదా మనుకున్నాను. కాని యిలా జరిగింది.

అందుకే స్కూటర్ని రామ్‌నగర్ వైపుకు పోనిచ్చాను.

నేను వెళ్ళేసరికి పరాంకుశం ఇంట్లో లేడు. ఆఫీసుకు వెళ్ళాడు. మాలతి ఇంట్లోనే వుంది!

నన్ను చూడగానే "రండి" అంటూ నవ్వుతూ లోపలకు ఆహ్వానించింది.

కూర్చున్నాను.

"ఎంతవరకు వచ్చింది మీ పరిశోధన?" అనడిగింది కాఫీ తెచ్చి యిస్తూ.

"ఇవాళే మొదలుపెట్టాను. ఈ పక్క ఇంట్లో ఎవరు

వుంటున్నారో మీకు తెలుసా?" అనడిగాను.

"ఎవరో కాలేజీ లెక్చరరు. ఆయన భార్య-పిల్లలు."

"మీరు మీ యింట్లో అటకమీద ఓ హంతకుడి బట్టలు, రివాల్వర్ దొరికినట్టుగా ఎవరికయినా చెప్పారా?" అడిగాను కాఫీ తాగుతూ.

"ఎవ్వరికీ చెప్పలేదండీ. ఆయన చెప్పవద్దని చెప్పారు" అన్నది.

"గుడ్!" అన్నాను లేచినిలబడి.

"మళ్ళీ వస్తాను. ఇంతకుముందు ఈ ఇంట్లోవున్న మనుషులను గురించి ఎంక్వాయిరీ చెయ్యాలి" అని బయటకు వచ్చాను.

స్కూటర్ని అక్కడే వుంచాను.

పక్కనే వున్న లెక్చరర్ ఇంట్లోకి వెళ్ళాను. ఆయన కాలేజీకి వెళ్ళిపోయాడుట.

"ఎందుకు?" అనడిగింది ఆయన భార్య.

"ఆయనే అవసరంలేదు. మీరయినా చెప్పొచ్చు. నెలరోజుల క్రితం ఈ పక్కయింట్లో ఎవరున్నారో చెబుతారా?" అనడిగాను.

ఆమె వెంటనే మాట్లాడలేదు. తర్వాత ఏదో చెప్పబోయేంతలో "ఎవరి గురించి? ఈ పక్కయింట్లో వున్న మొగుడూ పెళ్ళాం గురుంచా?" అని అడిగింది ఆమె కూతురు. ఆ అమ్మాయికి పదిహేనేళ్ళు వున్నాయి.

"అవును" అన్నాను.

"మాకు తేలీదండీ. మేము యెవరిగురించీ పట్టించుకునే వాళ్ళంకాదు. దానికూడా ఏమీ తెలీదు. అది చెబుతున్నది ఈ పక్కయింట్లో వుండి వెళ్ళిపోయిన వాళ్ళ గురించి" అన్నదామె గబుక్కున.

ఆమె అబద్ధం చెప్పిందని ఆమె మొహమే చెప్పింది. ఆమె కూతురివేపు గుడ్లు మిటకరించి చూసింది.

ఆ అమ్మాయి ఎక్కడికో బయల్దేరినట్లుంది. మూతి ముడుచుకొని లోపలకు వెళ్ళిపోయింది.

నిమిషం తర్వాత ఆమెకూడా లోపలకు వెళ్ళిపోయింది.

నేనూ బయటకు వచ్చాను ఆలోచిస్తూ.

ఆ అమ్మాయికి అంతా తెలుసు. కాని తల్లికి యిష్టం లేదు వాళ్ళగురించి చెప్పటం. ఎందుకు ఇష్టంలేదు. కారణ మేమిటి? తెలుసుకోవాలి?

స్కూటరు దగ్గరకు వచ్చాను.

మాలతి బయటే నిలబడి వున్నది.

"ఏమయినా తెలిసిందా?"

"వాళ్ళకు తెలీదట. ఈ ఇంటి ఓనరు ఎక్కడుం టాడు?" అడిగాను.

"బరకత్ పూర్ లో."

"ఎక్కడ?"

"పార్కు దగ్గర" అని ఎడ్రసు చెప్పింది.

"వెళతాను" అని స్కూటర్ని ముందుకు దూకించాను.

ఆ రోడ్డు చివరకు పోనిచ్చి కార్నర్ లో ఓ పక్కగా ఆపి సిగరెట్టు కాలుస్తూ నిలబడ్డాను.

ఎక్కడికో బయలదేరిన లెక్చరర్ కూతురు అటువైపు వస్తుందని నాకు తెలుసు.

నేను వూహించినట్టుగానే ఆ అమ్మాయి ఐదు నిమి షాల తర్వాత అటువైపు వచ్చింది. ఆ అమ్మాయి చేతిలో యేవో రెండు నవలలు వున్నాయి.

నన్ను చూడగానే ఆశ్చర్యపోయింది.

నవ్వి "మీ కోసమే ఇక్కడ నిలబడ్డాను" అన్నాను.

మార్పిస్తాను" అని ఫోనందుకుంది. విస్తుపోయి చూశాను. ఆమె లాయర్‌తో మాట్లాడుతోంది. ఏవేవో సూచన లిస్తోంది. ఫోన్ పెట్టేసి నన్ను నవ్వుతూ చూసి "నువ్వి ప్పుడీ ఇంటికీ—అన్నింటికీ అధికారివి" అంది.

పది గంటలకి లాయర్ వచ్చాడు. అతడితో గదిలో రెండు గంటలసేపు మాట్లాడిందామె. నేను బయటే వున్నాను. రావ్ మాటలు జ్ఞాపకమొచ్చి అదురు పుట్టింది. ఇప్పుడు విమల చేస్తున్న పని తెలిస్తే అతనెలా రియాక్ట్ అవుతాడు?

లాయర్ వెళ్ళిపోయాక విమల మనసు కుదుటపడింది. అతన్ని గెల్చి విల్లు నా పేర ఏర్పాటు చేశానని చెప్పి నప్పుడు నా కళ్ళకు మైకం కమ్మింది.

"విమలా! నువ్వు చాలా సాహసించావు."

"ఇది సాహసం కాదు, కృతజ్ఞత."

"నిన్ను—నిన్నెలా అభినందించాలో తెలియడంలేదు" ఆమెని రెండు చేతుల్లో గట్టిగా బంధించి పెదవుల్ని చుంబించాను.

ఆమె ముఖారవిందం సిగ్గుతో స్నిగ్ధమైంది.

సరిగ్గా 12 గంటలకి బాబ్జీ వచ్చాడు. అతని ముఖం చూస్తే తెలుస్తోంది, అతను మాకెంత సీరియస్‌గా సహాయ పడుతున్నాడో!

"కిరణ్, మీరు సాగర్‌లో వున్నట్టు అతనికెలా తెలిసిందో అర్థం కావటం లేదు. అసలు మీ పెళ్ళి గురించి అతనికెలా తెలుసు?" అన్నాడతను.

"సాగర్ గుంటూరుకి దగ్గర. అతను ఆర్టీసీలో పని చేస్తున్నాడు కండక్టరుగా. మీరే వూహించండి. డ్యూటీ మీద అక్కడికొచ్చినప్పుడు మమ్మల్ని చూశాడేమో?

అప్పుడే పెళ్ళి చేసుకున్నట్లు కూడా అర్థమై వుంటుంది" అన్నాను.

అతను తలూపాడు "కానీ, ఇక్కడ అతని ఆచూకీ దొరకడం లేదు. హోటల్స్ అన్నీ చెక్ చేశాం. స్నేహితుల దగ్గర వుంటున్నాడేమో తెలియదు. తెలుసుకోవడం కష్టం. బహుశ పత్రికలకి అతని ఫోటో ఇస్తే ప్రయోజనం...." ఇన్‌స్పెక్టర్ చెప్పుకుపోతోంటే మధ్యలో ఫోను మ్రోగింది.

విమల రిసీవరెత్తి సమాధాన మిచ్చింది. ఆ తర్వాత అవతలి మాటలు వింటూ భయంతో కళ్ళు విశాలం చేయసాగింది.

చటుక్కున రిసీవరందుకొని విన్నాను.

"....రాత్రి నీ మొగుడు వూడిపడి ప్లాన్ చెడగొట్టాడు. నేను పారిపోయాను. వాడో హీరో అనుకున్నావా నేను పారిపోవడానికి? అదేమీ కాదు. వాడూ నాలాగే సామాన్యుడు. పాపం, అదృష్టం వరించింది. కత్తిపెట్టి అన్యాయంగా చంపడానికి మనస్కరించలేదు. ఈ రాత్రి...."

ఇంతలో నా చేతిలో రిసీవర్ బాజీ లాక్కున్నాడు. అవతలి మాటలు ఆశ్చర్యంగా, వుద్రేకంగా విని, మౌనంగా పెట్టేశాడు.

"రాత్రి 11 గంటలకి ఛాలెంజ్ చేస్తున్నాడు" అన్నాడతను.

"అయితే వల విసురుదాం" అన్నాను.

సరిగ్గా రాత్రి 9 గంటలకి బాజీ హెడ్ కానిస్టేబుల్‌నీ మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌నీ వెంటబెట్టుకొచ్చాడు.

"ఓ. కే. ఇక వల విసురుదాం! మనం నల్గురం నాలుగు

చోట్ల వుండాలి" అన్నాడు హెచ్. సి. నుద్దేశించి.

ఆ తర్వాత కానిస్టేబిల్స్ వైపు తిరిగాడు "నువ్వు గేటు దగ్గరా, నువ్వు ప్రహారీగోడ పొడుగూతా కనిపెట్టాలి. నేను చుట్టూ పహరా కాస్తాను.

"మిస్టర్ కిరణ్, మీరా మెతో క్రింద డ్రాయింగ్ రూమ్‌లో గడియ వేసుకొనుండండి. పైన గది కెళ్ళకండి. పనిమనుషుల్ని ఎవరి గదుల్లో వారుండమనండి. అతను సమయమిచ్చి మరీ వస్తున్నాడంటే ఈసారి సీరియస్‌గా తీసుకుంటాడన్నమాట. జాగ్రత్తగా వుండండి. మేము వున్నంతవరకూ ఏ ప్రమాదమూ లేదు."

అలాగే నేనూ విమలా డ్రాయింగ్ రూమ్‌లో గడియ వేసుకొని కూర్చున్నాం. లైటార్పేశాం.

బయట వెన్నెల చక్కగా కాస్తోంది. రామారావు లోపలికి ప్రవేశిస్తే స్పష్టంగా కన్పిస్తాడు.

విమల నా చెయ్యి గట్టిగా పట్టుకొని కూర్చుంది. ఆమె చెయ్యి చల్లగా మంచుపలకలా వుంది. చీకట్లో ముఖ భావాలు కన్పించకపోయినా ఎంత భయపడ్తుందో తెలుస్తోంది. మృదువుగా ఆమె చేతిని తప్పించి నా చేతి లోకి తీసుకొన్నాను. ఆమె శరీరాన్ని వెచ్చబరచి భయం పోగొట్టాలని దురుసుగా నిమరసాగాను. ఆమె నా భుజం మీద వాలి గట్టిగా కరచుకుంది.

"విమలా! భయపడకు, ఏమీ జరగదు."

"ఓహ్! నేను న్యూసెన్స్‌గా తయారయ్యాను కిరణ్! ఏమనుకొని నిన్ను చేరదీశాను? ఏం జరుగుతోంది? నీ సవా లక్ష బాధలకి అదనంగా నేనూ చేరాను. నీకు క్షణం సుఖం ఇవ్వలేక పోతున్నాను."

"ఫరవాలేదు. ఈ ఒక్క రాత్రే! ఈ రాత్రి గడవ

నీయ్, మనకే సమస్యలూ భయాలూ వుండవు. సంతోషంగా వుంటాం."

ఆమెని ఒళ్ళోకి లాక్కొని హత్తుకొన్నాను.

అప్పుడే బయట ఒక్కసారిగా విజిల్స్ విన్పించాయి. కలకలం బయలుదేరింది. అరుపులూ, బూట్ల చప్పుళ్ళూ విన్పిస్తున్నాయి. విమల నన్నింకా బలంగా చుట్టుకుంది. నేను కొయ్యబారిపోయి వింటున్నాను....ఆ శబ్దాలన్నీ ఇంటి వెనక్కి వెళుతున్నాయి.

ఇంతలో ఏదో విరిగి పడిన చప్పుడు, గట్టిగా కేక! మళ్ళీ విజిల్స్....బూట్ల చప్పుడు....క్రమ క్రమంగా అవన్నీ దూరమవుతూ విన్పించడం మానేశాయి.

మేమిద్దరం ఎంత సేపు అలా గడిపామో తెలియదు. బాజీ వచ్చి తలుపు తట్టాడు. తటాలున వెళ్ళి తెరిచాను.

"ఏం జరిగింది?" ఆత్రంగా అన్నాను.

"తప్పించుకున్నాడు."

"ఎలా?"

"ముందు ప్రహరీగోడ దూకాడు. జవాను విజిల్ వేసే సరికి ఇంటి వెనుక ఉరికాడు! పెరటి తలుపు దగ్గర హెడ్‌ని ప్రక్కకు లాగేసి వీధిలోకి పారిపోయాడు. మేం వీధిలోకి వెళ్ళేసరికి ఎక్కడా కన్పించలేదు. బయట లైట్లు లేవు. తప్పించుకొన్నాడు."

"హెడ్‌కు బాగా దెబ్బలు తగిలాయా?"

"అసలతని జాడలేదు! మేం వెళ్ళేసరికక్కడ లేదు! కేక మాత్రం విన్నాం....అతను కొట్టి ఏ మూలకి లాగేశాడో చూళ్ళేదు."

నిట్టూర్చాను. ఇంతలో కానిస్టేబుల్స్ తిరిగి వచ్చారు.

"సార్! హెడ్డుగారి తల పగిలింది!"

"ఎలా? ఎక్కడున్నాడు?"

"వేపచెట్టు క్రింద పడిపోయాడు...."

"డామిట్! గున్నలా వున్నాడు, అడ్డుకోలేక అడ్డం పడ్తాడా!" అర్చాడు బాజ్జీ.

# 7

మర్నాడు మామూలుగా దినచర్యలు ప్రారంభమైయ్యాయి.

విమల బాగా నీరసించిపోయింది. రాత్రి రామారావు ప్రయత్నం విఫలమైనా ఆమె భయం తగ్గలేదు. విమల యింకా అపాయాన్నాశిస్తోంది.

కానీ, మళ్ళీ రామారావు యెలాటి ప్రయత్నాలు చేస్తాడని నా కన్పించడంలేదు. రాత్రి అతను పోలీసుల బారినుండి తప్పించుకొన్నాడు—ఒకర్ని గాయపర్చి. మళ్ళీ ఈ సారి సాహసిస్తాడనుకోను.

అయినా నా బాధ్యత గనుక, విమల వ్యతిరేకించినా మేనేజర్ కి ఫోన్ చేసి విషయం చెప్పాను.

"....రెండుసార్లు ఆమెమీద హత్యాప్రయత్నం జరిగింది. తప్పించుకుంది. ఈ రాత్రి కూడా జరగవచ్చు. మీ రామె శ్రేయస్సు కోరేవారు గనుక చెప్తున్నాను—ఆమెని రక్షించే ప్రయత్నాలేవైనా ఉంటే చెయ్యండి!"

"రాత్రిలోగా ఆ బాస్టర్డ్ ని అరెస్టు చేయిస్తాను!" అన్నాడతను ఆవేశంగా.

నవ్వుకొని ఫోన్ పెట్టేశాను.

ఇంతలో యెవరో నల్లటి కుర్రాడు వచ్చాడు. విమల అతన్ని తీసుకొని లోనికెళ్ళింది. ఆరంగాక నేనూ వెళ్ళాను. అక్కడామె మాసిన బట్టలేస్తోంటే ఆ కుర్రాడు

చాకలివాడనుకొన్నాను. అతడు బట్టలు నూతి దగ్గరకు మోసుకెళుతూంటే అనుమానం కలిగింది.

"అదేమిటి? రేవుకి తీసికెళ్ళడా?" అన్నాను.

"నా బట్టలు మరొకరిదాంట్లో కలపడానికి వీల్లేదు!" అంది విమల.

నేను మాట్లాడలేదు. ఆ పగలంతా ఆలోచిస్తూ గడిపాను, ఇంత ఆస్తిని నే నెలా అజమాయిషీ చేయగలనా అని! ఇంతకంటే ఆందోళనకరమైన విషయం, విల్లు నా పేర మార్చబడిందని తెలిసి రావ్ ఎలా రియాక్టు అవుతాడన్నది! పెళ్ళికి అంగీకరించనివాడు ఆ స్త్రీమీద పెత్తనం సహిస్తాడా?

సాయంత్రం ఆరు గంటలకి నేనూ విమలా లాన్‌లో కూర్చొని మాట్లాడుకోసాగాం. ఆహ్లాదకరంగా వుంది వాతావరణం. ఆ వాతావరణాన్ని చూశాక నా కొక ఆలోచన వచ్చింది. విమలని చూశాను.

"నువ్వు తిరిగి కోలుకోవాలంటే స్థలంమార్పు కావాలి. మనం ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోతే రామారావు పీడా వుండదు, నీ ఆరోగ్యమూ చక్కబడుతుంది. ఏమంటావు?"

ఆమె ముఖం వికసించింది. "అవును, సరిగా చెప్పావు! ఎక్కడికెళ్దాం?"

"నీ యిష్టం. నువ్వే ప్రోగ్రాం వెయ్యి!"

"చిత్ర వుంటే ఎంత బాగుండేది! దానికి అయిడియాలు బాగా వస్తాయి!"

"ఆమె అయిడియాలు నాకు కంపుకొడ్తాయి!"

"ఆమె నెందుకలా ఛీత్కరించుకొంటావు?"

"నువ్వాడదానివి! మరో మగవాడ్నడుగు—ఎందుకు

ఛీత్కరిస్తాడో? వెధవ ముక్కు, కళ్ళునూ! గొంతు చూశావా? కాకిలా అరుస్తుంది!"

ఆమె పకపక నవ్వింది. నేనది పట్టించుకోకుండా యింకా కోపం నటిస్తూ సిగరెట్ వెల్గించాను. దమ్ము లాగి పొగ వదులుతూ తల పైకెత్తాను. నా కళ్ళు డాబా గోడమీద నిశ్చలంగా వుండిపోయాయి.

"అరే, నీ చీర అక్కడుందేమిటి?" అన్నాను చూపిస్తూ.

విమల వెనక్కి తిరిగి పైకి చూసింది.

"ఉదయం బాచిగాడు ఆరేశాడు. మధ్యాహ్నం బట్ట లన్నీ ఇంట్లోకి తెచ్చాడు.... దాన్ని మర్చిపోయి వుంటాడు" అంది లేస్తూ.

"నువ్వెందుకు? రాజుని పంపు!" అన్నాను మొక్కలు కత్తిరిస్తున్న అతన్ని చూస్తూ.

"అతను మెట్లెక్కలేడు.... కీళ్ళ నొప్పులు."

"అయితే శాంతాన్ని పంపు!"

"ఆమే ఎక్కలేదు.... పెద్దమనిషి."

"అయితే మెట్లెక్కలేని మనుషులు ఇంట్లో యెందుకు? షెడ్ మెంట్లమీద వుండమను!" అన్నాను తీవ్రంగా.

ఆమె చివాల్న చూసింది. ఆమె కళ్ళలో బాధ తళుక్కున మెరిసింది—

"నువ్వింత చవగ్గా మాట్లాడతావనుకోలేదు!" అంది లేచి చరచరా వెళ్ళిపోతూ. మౌనంగా సిగరెట్ పీల్చ సాగాను. విమల వెళ్ళిన కాస్సేపటికి డాబా మీద కన్పించింది. చీరను విసురుగా అందుకొని వెనక్కి తిరి గింది. ఆమె కోపానికి నవ్వుకుంటూ చూపులు రాజు మీదకు మళ్ళించాను. అతనింకా కత్తిరించడంలోనే

నిమగ్నుడై వున్నాడు.

ఇంతలో కేక విన్పించింది——

విమల కేక!

తలెత్తి చూశాను.

విమల డాబా మీంచి పడిపోతోంది....!! ఆమె చేతిలో చీర గాలికి రెపరెపలాడుతోంది! క్షణంపాటు డాబామీద ఓ ఆకారం కన్పించి అదృశ్యమైంది. విమల వేగంగా క్రిందికి వచ్చేస్తోంది! నా పిచ్చిగాని, ఆమె నందుకోవాలని చేతులుజాపి వురికాను.....ఆ లోపు ఆమే క్రింద కారు బాయ్‌నెట్ మీద బోర్లాబడి అతుక్కు-పోయింది! నేనక్కడికి చేరుకొనేసరికి అంతా అయి పోయింది....

విమల ఈ లోకం విడిచిపెట్టేసింది!

# 8

విధి నెవరు మార్చగలరు? అసలు దాన్ని తెలుసుకుంటే కదా మార్చడానికి!

ఈ భూమ్మీద కాలు పెడుతున్నప్పుడు భగవంతుడు ఫలానావారికి ఫలానా ముద్ర అని నిర్ణయించి నుదుటి మీద కొట్టి పంపిస్తాడు. అందులో భావాల్ని పసిగట్టి ఇష్టానుసారంగా చెరిపేసుకొని మార్చుకొనే శక్తి మానవ మాత్రుడికి లేదు!

విమల నొసట ఈరోజు చావు రాసిపెట్టి వుంది. చని పోయింది. ఆమెనెవరూ ఆపలేరు. తిరిగి బ్రతికించనూలేరు. కానీ విమల చావుకి కారణభూతులైన వారిని శిక్షించ గలం. అదొక్కటే ఆమె ఆత్మవిషయంలో చేయగల్గింది.

ఒక విధంగా విమల చావు క్కారకుడ్ని నేనే నేమో? ఈ పెళ్ళి జరక్కపోతే ఆమె క్షేమంగా వుండేదేమో?

ఈ పెళ్ళివల్ల అసూయతో, పగతో, రామారావు ఆమె నంత మొందించాడు!

రామారావు!

చివరికి పంతం నెగ్గాడు! అతని నుండి ప్రమాదం రాత్రులే ఆశించాం గానీ, పగలుకాదు. రాత్రిళ్ళు వరుసగా విఫలం కావడంతో ఇలా ఎవరూ అనుకోని విధంగా పగటి ప్రయత్నానికి పూనుకొన్నాడు!

విమల చనిపోయింది. ప్రతివారూ నన్ను నిందించే వారే! నే నామెకు దురదృష్టం తెచ్చానట! పొట్టన బెట్టుకున్నానట! నోటికొచ్చినట్లు కూసి శాపనార్థాలు పెట్టి వెళ్తున్నారు! అవన్నీ భరించాను.

నా కెవరి సానుభూతి అక్కర్లేదు. నా మానాన నేను బ్రతుకుతాను. దూరంగా వెళ్ళిపోతాను. ఒంటరిగా బ్రతుకుతాను. ఎవరి సహకారమూ అవసరంలేదు.

విమల నాను కొండంత ధైర్యాన్నిచ్చింది—ఎవరెన్ని ఆటంకాలు కల్గించినా చట్టరీత్యా నాకు సంక్రమించే ధనాన్నిచ్చింది. ఇవి చాలు! ఆమెకు నేను ఆజన్మాంతమూ రుణపడివుంటాను.

ఆ రాత్రి నిద్రలో విమల కన్పించి పకపక నవ్వింది—వెటకారంగా—హేళనగా. ఆ నవ్వు కర్థం తెలియలేదు! ఎందుకలా నవ్వింది? నే నామె చావుని పరిష్కరించకుండా నా భవిష్యత్తు గురించి కలలు గంటున్నాననా?

ఆమెని జీవితాంతం ప్రేమిస్తాననీ, మర్చిపోననీ వాగ్దానం చేశాను. ఇప్పుడు దాన్ని విస్మరించి, సిగ్గు లేకుండా నా బాగోగులు చూసుకొంటున్నానని ఆగ్రహం వెలిబుచ్చుతోందా?

రెండు రోజుల తర్వాత ఇన్‌స్పెక్టర్ బాజీ ఒక వార్త మోసుకొచ్చాడు—రామారావు గుంటూర్లో తన ఇంట్లో ఉరిపోసుకు చనిపోయాడట!

పగ తీరాక చట్టం చేతిలో నలగడం మనస్కరించలేదేమో, జీవితాశయం నెరవేరింది గనుక తృప్తిగా తనువు చాలించాడు.

నవ్వాలో ఏడ్వాలో అర్థంగాలేదు. విమల వెటకారపు నవ్వు యింకా మాననేలేదు. రోజులు గడుస్తోంటే ఆ యింట్లో గడపటం దుర్భరమనిపిస్తోంది. వంట మనిషినీ, రాజునీ తరిమేశాను. హోటల్స్‌లో తింటూ, బార్స్‌లో తాగుడు మరిగాను.

నా పరిస్థితి చూసి చిత్ర సహాయపడాలనుకుంది. ఆమెను కసిరికొట్టాను. నా కెవరూ వద్దు. ఎవరి కపట స్నేహమూ వద్దు. నేనిప్పుడు డబ్బుగలవాడ్ని. మనిషి ఛాయ పడని చోటు కోసం అన్వేషిస్తాను. అలాటి చోటు ఈ విశ్వంలో ఏ మారుమూల ఉన్నా సరే-అక్కడ నా దంటూ ఒక సామ్రాజ్యాన్నేర్పరచుకుంటాను. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బ్రతికేస్తాను!

మరో నెల గడిచాక యింకా యిక్కడ వుండటంలో అర్థం కన్పించలేదు. గడ్డు పరిస్థితి అంటూ ఏర్పడ్డాక దాన్నెప్పటికైనా ఎదుర్కోవాల్సిందే! నేనిప్పుడే తెగించడానికి సిద్ధపడ్డాను.

లాయర్‌ని పిల్చి నా కార్యక్రమం వివరించాను. కంపెనీతోబాటు ఆస్తులన్నీ అమ్మకానికి పెట్టమన్నాను. నా చేతికి నగదు కావాలి. నేను మరో ప్రపంచంలో అడుగు పెట్టాలి. మొత్తం ఎంత డబ్బు రావచ్చు? కంపెనీ ఆస్తులు రెండుకోట్లు విలువచేస్తాయి. కలకత్తా, విజయ

వాడలోను, ఇంకా పలుచోట్ల ఆస్తులన్నీ కలిపి మరో కోటిన్నర చేస్తాయి. మొత్తం మూడున్నర కోట్లన్న మాట?

ఈ ఆస్తుల అమ్మకం వార్త దుమారంగా లేచింది. కాకులు నన్ను కుళ్ళబొడిచాయి. అందరికీ చిరునవ్వుతో సమాధానమిచ్చాను. నా ఆస్తి, నా హక్కు. ఇందులో మీ జోక్యం మంచిది కాదు. మైండ్ యువర్ బిజినెస్.

నా ఆగడాలు చూసి మేనేజర్ రావ్ అంతెత్తు కెగిరాడు. ఎంత యెగిరినా కాళ్ళు విరగడంతప్ప ప్రయోజనంలేదు. నన్ను ఛాలెంజి చేస్తాడా? నా దారి వెనక్కి మళ్ళదుగాక మళ్ళదు!

## 9

ఈ ప్రపంచం నా కాళ్ళక్రింద నలుగుతున్నట్లు ఫీలయ్యాను. నా ఆనందాని కవధుల్లేవు! ఇన్నాళ్ళూ నన్ను అసహ్యించుకున్న వాళ్ళంతా ఇప్పుడు నా కాళ్ళ దగ్గర కుక్కల్లా చేరుతారు! నేను చెప్పినట్లు ఆడుతారు! వాళ్ళ జుట్టు నా పరంజేసి, చేతులు జోడించి నిలబడతారు! డబ్బు! డబ్బు! అంతా డబ్బు!!

గత పదిహేనేళ్ళ నా జీవితం ఎన్నో అవమానాలకూ, అన్యాయాలకూ గురయింది. అందరి స్వార్థానికీ, హింసకూ బలయ్యాను. ఎన్నో ఎదురుతెన్నులు తిన్నాను. ఏ నాటికీ ఒడ్డు చేరలేకపోయాను.

అసలు నేనే కావాలని ఆ జీవితంలోకి అడుగుపెట్టాను. తీరా అనుభవమయ్యాక బయటపడాలని ఆరాటపడ్డాను. నా కలలే నన్ను తుదముట్టించాయి! వూహ పెరగక పోయినా కలలు మాత్రం బ్రహ్మాండంగా కనేవాడ్ని. బళ్ళో చదువుకునేటప్పుడు నా తోటివాడు కట్టుకునే

రిస్టువాచీ నుంచి, బయట ప్రపంచంలో పడ్డాక షియట్ కారువరకూ నా కలలు పెరిగాయి.

ఆ రిస్టువాచీ నాలో నేర ప్రవృత్తికి నాంది పలికింది. దానికోసం వాడ్ని చెరువులో ముంచి చక్కాపోయాను. అలా నేరాలతో మునిగి తేలుతున్న నా జీవితం హైద్రాబాద్‌లో చిత్ర పరిచయంతో వింతమలుపు తిరిగింది.

చిత్ర!

చిత్రను నేను అసహ్యించుకొంటున్నట్టు మనవిచేశాను. ఆ అసహ్యం వెనుక అసలు కారణం యిప్పుడు చెప్తాను.

నిజానికి చేప కళ్ళం టే నాకు చాలా ఇష్టం. అందులోనూ అవి వాలు చూపులు విసిరేవైతే మరీ ఇష్టం. అలాటి చిత్ర కాంతివంతమైన నయనాలు, వికసిత వదనం చూశాక సగం పిచ్చివాడ్నై హృదయం తీసి ఆమె చేతుల్లో పెట్టేశాను!

ఆ రాత్రి 'షాలిమార్' చిత్రం చూసి ఆటో కోసం ఎదురు చూస్తున్నాను. జనం ఎక్కువ వుండడంవల్ల దొరకడం కష్టమవుతోంది....రద్దీ తగ్గాక నిదానంగా వెళ్దామనుకొని రోడ్డువారగా నిలబడ్డాను. అప్పుడే దిక్కులు చూస్తూ వచ్చి నా ప్రక్క నిలబడ్డ చిత్రను చూశాను.

ఆమెని చూశాక పలకరించకుండా వుండలేక పోయాను.

"మీకూ ఆటో కావాలా?" అన్నాను.

తలూపిందామె. అటూ ఇటూ చూశాను. దూరంగా వస్తోన్న ఆటోని చూసి చెయ్యూపి దగ్గరికి పిల్చాను. అది వచ్చాక ఆమెని చూసి ఎక్కమన్నట్టు సైగ చేశాను. ఆమె తటపటాయించింది.

"మీరు వెళ్ళరా?" అంది.

"మరో ఆటోలో వెళ్తాను" అన్నాను.

"ఎక్కడికి వెళ్ళాలి?" మళ్ళీ అందామె.

చెప్పడానిక్కి మనస్కరించలేదు. "మీరు?" అన్నాను.

"కంపాలా హోటల్" అందామె.

"నాది అదే దారి. కానీ...."

"అయితే మీరూ రండి!" అందామె. కాస్సేపు సందేహించి ఎక్కేశాను. కానీ అడగడంతోటే వెళ్ళటం సభ్యత కాదనిపించింది. ఆటో బయలుదేరింది. చాలా సేపు ఆమె మాట్లాడలేదు. ఏదో ఆలోచనలో వుంది. నేనే ఏదో మాట్లాడాలని అన్నాను, "ఎలా వుంది సినిమా?"

ఆమె తేరుకుని చూసింది. అంతలోనే నవ్వి, "షేంజ్ నవల 'ది వల్చర్ ఈజ్ ఎ పేషంట్ బర్డ్' చదివాను. దానికీ దీనికీ పెద్ద తేడా కనిపించలేదు" అంది.

"కానీ ఆ స్క్రిప్టుమీద కృష్ణషా ఆరేళ్ళు వర్క్ చేశాడని విన్నాను" అన్నాను.

"ఎన్నేళ్ళు కృషి చేసినా దాన్ని హాలీవుడ్ పద్ధతిలో తీయడమే పొరపాటు. మాస్‌కు నచ్చే మసాలాలున్నప్పుడే చిత్రాలు హిట్ అవుతాయి...."

"మాస్ సంగతి వదిలేయండి. మీరు క్లాస్—క్లాస్ గురించి చెప్పండి."

మళ్ళీ నవ్విందామె. "నిజం చెప్పాలంటే నాకు క్రైం చిత్రాలు నచ్చవు. సాహిత్యం చదువుతానంతే."

"అలాగా? నాకు చదువు సరిగా రాదు. ఎలా వున్నా ప్రతీ సినిమా చూసేస్తాను!"

ఆమె వింతగా చూసింది. "మీకు చదువు రాదంటే నమ్మను!"

"సరిగా రాదన్నాను—సవరించుకోండి."

"ఓహ్, ఏం చదివారు?"

"మెట్రిక్ తప్పాను. మళ్ళీ హైరానాపడి చదవలే నన్పించింది. మా అమ్మ కూడా ఆ విషయం ఒప్పుకుంది."

ఆమె ఎగాదిగా చూసింది. "మీ రెక్కడుంటారు?"

"నాకో పూరూ అడ్రసూ లేదు."

"అంటే?"

"ఏదైనాచేసి స్వతంత్రంగా బ్రతకాలని ఇక్కడ తిరుగుతున్నాను."

"ఏం చెయ్యాలనుకుంటున్నారు?"

"ఏదీ చెయ్యడానికి సందేహించను.... నా సంగతి వదిలేయండి. మీరు హోటల్‌లో ఎందుకుంటున్నారు?"

"విజయవాడనుంచి వచ్చాను. నా ఫ్రెండ్ పనిమీద."

"ఒంటరిగానా?"

"అవును."

నేను మాట్లాడలేదు. ఆటో వెళ్తోంది. ఆమె మరి పలకలేదు. మౌనంగా ఆలోచిస్తోంది. మధ్య మధ్య నన్ను గమనిస్తున్నట్లు అనిపించింది.

నాకూ ఆమె కళ్ళకేసి చూస్తూ గడపాలని ఆరాటంగా వుంది గానీ, సాహసించలేకపోయాను. అలా ప్రారంభ మైన మా పరిచయం మూడు రోజులుసాగింది. ఆ అవ కాశంతో ఆమె కళ్ళకేసి చూస్తూ గడిపే భాగ్యం పూర్తిగా లభించింది. మాలో ఆకర్షణ పెరిగి బంధం ఏర్పడింది.... మేమిరువురం చెయ్యీ చెయ్యీ కలిపి బాసలు చేశాం.

అయితే నా గతాన్ని దాచి ఆమెను మోసగించడం నచ్చలేదు. అందువల్ల నా చరిత్రంతా చెప్పేశాను—ఆమె

వాడలిపోలేను. ఆసక్తిగా వింది. విన్నంత వేగంగానూ ఆలోచించింది. చివరికి అంది—

"కుమార్, నాకూ నీలాంటి ఉద్దేశమే వుంది. కానీ, అది నెరవేరదన్పిస్తోంది...."

"ఏమిటో చెప్పు" అన్నాను.

"నాకో ఫ్రెండ్ వుంది. వొంటరిగాతే. కోట్ల ఆస్తికి వారసురాలు.... నేనీ బ్రతుకుతో విసిగిపోయాను! నాకూ సౌఖ్యాలు కావాలి! అందమైన నగలు, బస్తులు, డబ్బు, కారు, బంగళా, ఇంకా....ఇవన్నీ దానిదగ్గర చూసి ఉవ్విళ్ళూరడం తప్ప సాధించలేకపోతున్నాను. నువ్వూ ఇదే ఆలోచనలో వున్నావు. ఒకవేళ మనిద్దరం కలిస్తే సాధించగలమేమో?"

ఆమెని పరీక్షగా చూశాను. ఆమెకిలాంటి ఆలోచన లుంటాయని అనుకోలేదు!

"సాధించగలం. నీకేదైనా ఉపాయం వుంటే చెప్పు" అన్నాను.

"చాలా ఆలోచించాను. నిన్ను చూసినప్పుడే అను కున్నాను—ఇది నీ వల్లనే సాధ్యమవుతుందని. ముందు నువ్వామెని పెళ్ళి చేసుకోవాలి. ఆమె మనసు పాదరసం లాంటిది. సరైన తోడుకోసం తపించిపోతోంది....నిన్నూ నీ గ్లామర్‌నీ చూసి సులభంగా లొంగిపోతుంది! పెళ్ళయాక విల్లు నీ పేర మార్చేలా చేస్తే, వీలు చూసుకొని ఆమెని తప్పించవచ్చు—ఎలా వుంటుంది?"

ఈ ఆలోచన నాకు నచ్చింది. దీన్ని మేం ఇంకా మెరుగులు దిద్ది పటిష్టమైన పథకం సిద్ధంచేశాం. వారం రోజుల్లో అమల్లో పెట్టాం.

చిత్ర విజయవాడ వెళ్ళి ఏర్పాట్లన్నీ చేశాక నేను

బయలుదేరాను.

ఆ రోజు సాయంత్రం ఆ రోమియోని నేనే యాభై రూపాయలిచ్చి విమల మీదకు ఉసిగొల్పాను. ఫలితం మేం అనుకున్న విధంగానే వచ్చింది! ఆ తర్వాత నా కట్టు కథలతో విమల నా ఆకర్షణలో పడ్డం సరిగ్గా చిత్ర చెప్పినట్టే జరిగింది!

చిత్రా నేనూ ఎదురుపడ్డప్పుడు ఏ రూపంలోనైనా మా భావాలు బయటపడవచ్చనన్న భయంతో, ఆమెని అసహ్యించుకున్నట్లు నటిస్తూ దూరంగా వుంచసాగాను. విమలకు మా మీద ఏ అనుమానమూ రాలేదు. మా నాటకం బాగా రక్తి కట్టింది!

ఆ తర్వాత చిత్ర విమలను పెళ్ళికి ఒప్పించింది. మేం హనీమూన్ కెళ్ళి సాగర్ రావడానికి ఒక రోజుముందు, చిత్ర నాగులు ముఠాని రంగంలో దింపింది. గతంలో విమలను వేధించిన రామారావుని మా పథకంలో బలి పశువుగా వాడుకోవాలని నిశ్చయించాం.

దాని ప్రకారం నాగులు ముఠా గుంటూరులో రామారావ్‌ని కిడ్నాప్ చేసి విజయవాడలో బంధించింది. అప్పటినుంచి నాగులు రాత్రులు సంచరిస్తూ రామారావు పాత్ర పోషించసాగాడు....

ఆ రోజు ఉదయం చాకలి కుర్రాడు వచ్చినప్పుడు నాకో ఉపాయం తట్టింది. దాన్ని నాగులుకి ఫోన్ చేసి చెప్పాను.

మధ్యాహ్నం ఆరిన బట్టలన్నీ బాచిగాడు ఇంట్లో తెచ్చిపెట్టాక, నేను రహస్యంగా ఒక చీర డాబామీద చేరవేశాను. సాయంత్రం పెరటి తలుపు తీసివుంచాను. నేనూ విమలా లాన్‌లో కూర్చున్నప్పుడు కారును సరిగ్గా

డాబా గోడ క్రింద వుండేలా చూశాను. అప్పుడు అనుకున్న విధంగా అంతా జరిగిపోయింది.

నాగులు వెనుక దారిగుండా డాబా చేరుకొని గోడ మీద చీర వేయడం; దాన్ని నేను విమల దృష్టికి తేవడం అనుకున్నట్టే ఆమె పైకి వెళ్ళడం; క్షణాల్లో గావుకేకతో క్రిందికి పడినప్పుడు—సూటిగా కారు బాయ్‌నెట్ మీద జెండా ఎగురవేసే అరంగుళాల పొడవు మొనదేలిన కడ్డీ ఆమె గుండెల్లో గుచ్చుకోవడం....

అంతా అనుకున్నట్లే జరిగిపోయింది! రామారావుని మా క్షేమం కోసం ఉరితీయించి ఇంట్లో వ్రేలాడదీశాం! దాంతో మా పథకం పూర్తిగా విజయవంతమైంది!

ఇప్పుడు మాకేదీ అడ్డులేదు. మా మార్గం పూర్తిగా సుగమమైంది! నా చేతికి డబ్బు రావడమే ఆలస్యం, ఇక్కడ్నుంచి దూరంగా కనుమరుగవుతాం. వీలైతే దేశం విడిచి పారిపోతాం!

మూడున్నర కోట్లు! నా వొడలు జలదరించింది.

# 10

టాక్సీ ఇంటిముందాగడంతో ఉలికిపడి తేరుకున్నాను. ఇల్లు చీకటిగా నిశ్శబ్దంగా వుంది. పైన గదిలో లైటు వెలుగుతోంది. అయితే చిత్ర వచ్చేసిందన్నమాట!

గేటు తెరిచి లోనికెళ్ళాను. చల్లటిగాలి వీచి శరీరం పులకరించింది. నైట్ క్వీన్ పరిమళం గుప్పుమని వ్యాపించి ఏదో తెలియని అలౌకికానుభూతికి గురిచేసింది. మొక్కలు చెట్లూ వొయ్యారంగా వూగుతున్నాయి.

ఆకాశంలో చంద్రుడు లేడు. అయితే ఏమిటి? చిత్రతో నేను గడుపబోయే మధుర క్షణాల్ని తలచుకున్నప్పుడు, చల్లని చైత్రమాసపు రాత్రులలో వికసించే

పున్నమి వెన్నెల వేడిలా, ఈ నిశా రాత్రి వాతావరణమే ఆహ్వానిస్తోంది!

వేగంగా ఇంటికేసి అడుగులేస్తున్నాను. నాలో ఆతృత గుర్రమై దౌడుతీస్తోంది! పథకం విజయవంత మయ్యాక మొదటిసారి చిత్రను కలుసుకోబోతున్నాను. అప్పుడు చూడాలి, ఆమె సుందర నయనాలు ఎలా విప్పారి, ముగ్ధ మోహన సౌందర్యం ఆనంద సాగరంలో వింత కాంతులను విరజిమ్ముతుందో!

నడుస్తున్నవాడ్నల్లా ఎందుకో ఆగిపోయాను.

ఏదో మెరుపులాంటిది నా కళ్లను సోకినట్లన్పించింది. తల త్రిప్పి చూశాను—అప్పుడు కన్పించింది—విమల—ఆమె అక్కడ—పోకచెట్టు క్రింద—

నిటారుగా నిలబడి తీక్షణంగా చూస్తోంది. ఆమె కళ్లు కొవ్వొత్తుల్లా వెలుగుతున్నాయి. అతి పల్చటి తెల్లని వస్త్రం మిరుమిట్లు గొలుపుతున్న ఆమె అంగ సౌష్టవాల్ని మరుగుపరుస్తోంది. ఆమె ముఖంలో ఏ భావాలు లేవు. ఆమెలో అసలు చలనంలేదు! శిలా విగ్రహంలా నిలబడి నాకేసి చూస్తోంది—

నా కాళ్లలో వణుకు పుట్టింది. వొళ్లు చల్లబడిపోయి నోరు తడారింది. గొంతు పెగలడంలేదు. కళ్లప్పగించి చూస్తున్నాను. ఊపిరి వేగం హెచ్చి ఆయాసపడుతున్నాను. అతి కష్టంమీద గొంతు పెగిల్చి అన్నాను. "విమల—విమల నువ్విక్కడ—"

కానీ సమాధానంలేదు. ఆమె నా మాటలు విన్నట్లు లేదు. ఆమె చూపుల్లో తీవ్రత తగ్గలేదు. వాటి తీక్షణత ధాటికి తట్టుకోలేకపోతున్నాను. నా చేతిలో సూట్ కేసు జారి క్రింద పడింది—

భయంతో, "విమలా....!! నువ్విక్కడేం చేస్తున్నావ్?" అనర్చాను శక్తికొద్దీ.

ఆమె కళ్లు అగ్నిగోళాలయ్యాయి.

వణుకు క్రమంగా నాలో పైకి ప్రాకి, చలిజ్వరం రోగిలా రెండు దవడలూ విపరీతంగా కొట్టుకో నారంభించాయి....

విమల రెండు చేతులూ చాచి చిన్నగా నా వైపు రాసాగింది.

"వి-వి-విమలా! నన్నేమీ చెయ్యకు! ప్లీజ్! నన్నేమీ చేయకు!"

ముందుకు తిరిగి పరిగెత్తనారంభించాను. వేగంగా వురికాను.

వెనుక ఆమె నవ్వుతోంది—హేళనగా—వెటకారంగా!

ఒక్కో అంగలో మూడేసి మెట్లెక్కి వరండా చేరుకున్నాను. తలుపుమీద దబ-దబా బాదేస్తూ చిత్రని పిల్చాను.

చిత్ర నిదానంగా తలుపు తెరిచి, "ఎవరూ?" అంది.

"నీ ముఖం! పద లోపలికి!" ఆమెని వెనక్కి నెట్టి లోనికి దూకాను. దభాలున తలుపువేసి గడియపెట్టాను.

చిత్ర నన్ను వింతగా చూస్తోంది.

"ఏమిటి కుమార్? ఏమైంది? ఎందుకలా వున్నావ్?"

కాస్సేపటివరకు మాట్లాడలేదు. నా భయం ఇంకా తొలగలేదు. ఇలాటి అనుభవం ఇదివరకెన్నడూ లేదు!

"చిత్రా! మనం ఇక్కడ్నుంచి పారిపోవాలి! వెంటనే ఈ ఇల్లు వదిలేయాలి!"

"ఎందుకు? ఏం జరిగిందసలు?" గాభరాగా అడిగిందామె.

"నీకేం అనుభవం కాలేదా?"

"ఏ అనుభవం?"

"విమల నీకు కన్పించలేదా?"

ఆమె ముఖం చిట్లించింది, "ఏమిటీ! ఆమె కన్పిస్తుందా?"

"అవును, ఆమె దెయ్యమై తిరుగుతోంది—ఈఇంట్లో. నిన్నూ నన్నూ ఇక ప్రాణాలతో వదలదు!"

"కుమార్!" ఆమె దగ్గరికొచ్చి అర్చింది, "ఏమిటి నువ్వనేది? ఆమె దెయ్యమైందా!"

"అవును...." సహానంగా అన్నాను. "నేను వస్తోంటే పోకచెట్టు క్రింద నిలబడి వుంది. కదలకుండా, మెదలకుండా క్రూరంగా చూస్తోంది... నేనెలా తట్టుకున్నానో-నువ్వైతే అక్కడే ప్రాణాలు విడిచేవానివి!"

ఆమె నాతలపట్టుకొని నొక్కుతూ సముదాయిస్తున్నట్టు అంది.

"భయపడకు! ఆమె ఇక్కడికి రాదు. ఆమె చనిపోయింది. అంతే. ఆమెను నువ్వు చూశావంటే అది వట్టి భ్రమ!"

"యూ ఫూల్! ఆమె పక-పకా నవ్వింది కూడా—నీకు విన్పించలేదా?"

"నాకేమీ విన్పించలేదు. నువ్వు ముందు స్నానం చెయ్యి కుమార్, మనసు తేలికపడుతుంది."

ఆమెని విదిల్చికొట్టి లేచాను. కిటికీ దగ్గరికెళ్లి బయటికి చూశాను. చీకటి తప్ప ఏమీలేదు—

తిరిగి చిత్రను చూశాను.

"ఆమె దెయ్యమై సంచరిస్తోంది! నేను చూసింది నమ్మితాను! మనమిక్కడ వుండకూడదు చిత్రా, పారిపోవాలి!"

"ప్లీజ్ కుమార్, శాంతించు! నువ్వలాంటివి నమ్మకు!"

"అంటే, నేను చూసింది అబద్ధమంటావా?" అన్నాను ఏ మాత్రం భయపడుతున్నట్లు లేని ఆమె ముఖం లోకి ఆశ్చర్యంగా చూస్తూ.

"అది విమల రూపం! ఆమె నవ్వింది! నా మాటలు నువ్వు ఎందుకు నమ్మవు? నేను చూసి ఇంత భయపడు న్నానంటే—నువ్వు ఆడదానివి—విని ఎంత భయపడాలి? నీకంత ధైర్యం ఎక్కడిది! నువ్వెందుకు భయపడ్డంలేదు? చెప్పు చిత్రా...."

ఆమె కటువుగా అంది, "నీకు పిచ్చెక్కినట్టుంది, కుమార్."

నేనొక్కసారిగా ఉలిక్కిపడ్డాను. నా మెదడులో ఏదో అనుమానం రగుల్కొంది. ఆమె కళ్లలో సూటిగా చూసి చెంపమీద కొట్టాను.

"చెప్పు! నిజం చెప్పు! నువ్వేం చేశావు? నటించలేదూ? మన పథకం ఆమె పసిగట్టి నిన్ను బ్లాక్ మెయిల్ చేసింది, అవునా? ఆమె బెదిరింపులకి భయపడి నువ్వంతా కక్కే శావు! నా చరిత్రంతా చెప్పేశావు! నేనెవరో తెలుసుకుని ఆమె నీ సహాయంతోనే ఎదురు పథకం వేసింది! నువ్వామెని చంపలేదు! ఆమె చావుని ఫేక్ చేశావు! యూ డెవిల్! నన్ను మోసం చేశావ్! నీ కళ్లలో వున్న విధేయత మనసులో లేదు! నీ కళ్లు చూసి మోసపోయాను! యూ డబుల్ క్రాసింగ్ బిచ్!"

రెచ్చిపోయిన ఆవేశంతో ఆమె ముఖం మీద మళ్ళీ కొట్టాను.

ఆమె తూలి క్రింద పడింది.

"కుమార్! నీకు మతిపోయింది! పొరబడుతున్నావు!

నేను మోసం చెయ్యలేదు! విమల నిజంగా చచ్చింది! కావాలంటే నాగులు ముఠాచేత నిరూపిస్తాను।"

"నువ్వందమైన అబద్ధాల్ని సృష్టించగలవు!" అర్చాను పిచ్చిగా, "యూ డామ్ లిటిల్ స్లట్! నా కలల గోపురాన్ని కొల్లగొట్టావు! నువ్వింక బ్రతకూడదు!"

ముందుకి దూకి ఆమె కంఠం పట్టుకున్నాను.

ఆమె విదుల్చుకో జూసింది.

నేనామె కంఠం బలంగా పట్టుకొని లేపి నిలబెట్టాను. నా వేళ్లు ఆవేశంగా ఆమె కంఠం చుట్టూ బిగుసుకు పోతున్నాయి.

ఆమె కళ్ళు తేలవేసింది.

"వద్దు! నువ్విలా చెయ్యకు! నన్ను చంపకు! నువ్వు—నువ్వు—చాలా చింతిస్తావు కుమార్!" ఆమె బలహీనంగా అరుస్తోంది.

ఆమె విల-విల్లాడుతూ నాలిక వెళ్లబెట్టేసింది. కళ్లు పెల్లుబికి వచ్చాయి. నా ఒంట్లో శక్తినంతా ఆమె కంఠం చుట్టూ కేంద్రీకరిస్తున్నాను....కొన్ని క్షణాల్లో దాన్నిక వృధా చేయ నవసరంలేదని తెలుసుకున్నాను.

ఆమె శరీరం నా చేతుల్లోంచి జారి దబ్బుమని నేలమీద పడింది—

  

రాబందు లొచ్చేశాయి: రెక్కలు రెప-రెపలాడించు కుంటూ వాలి—మాంసపు ముక్కల కోసం అవురావురు మంటూ ఆక్రమించుకుంటున్నాయి. ఈ రాబందులు చచ్చిన శవాల్ని పీక్కు తినవు. బ్రతికున్న జీవాల్ని కుళ్ల బొడుస్తాయి.

నా గుండె వేగంగా కొట్టుకుంది. చివరికి నా బ్రతుకు

వీళ్ల చేతుల్లో అంతం కాబోతుందన్న మాట! నా గతంలో వీళ్లతో చాలా నికృష్టపు అనుభవాలున్నాయి. వీళ్ల ట్రీట్ మెంట్ తో నా శరీరంలోని ప్రతి అవయవమూ దాని నైశిత్యం కోల్పోయి శిథిలమైంది. చిక్కిన ప్రతి సారీ మళ్లీ చిక్కకూడదని మొక్కేవాడ్ని. ఇప్పుడు మళ్లీ చిక్కాను—శాశ్వతంగా పోలీసులకు. నాకిప్పుడు విముక్తి లేదు.

రాజు!

వీడ్ని నేను కల్లో కూడా అనుమానించలేదు! వీడు నా పొంచి వున్న శత్రువని భావించివుంటే ఎంతో జాగ్రత్త పడేవాడ్ని.

విమల చావు విషయంలో వీడు రావ్ నన్ను అనుమానించారు. నన్ను ఓ కంట కనిపెట్టసాగారు. చిత్రతో నా ఘర్షణ కిటికీ చాటున వుండి చూశాడు రాజు. నేనామెని చంపడం కళ్లారా చూశాడు!

బాస్టర్డ్! వీడిప్పుడు నన్ను పోలీసుల చేతుల్లో పెట్టాడు. లేకపోతే చిత్ర శవాన్ని డ్రమ్ములో చేర్చి నిండా తారు నింపి, సీలు చేసి కృష్ణా నదిలో ముంచేసే వాడ్ని! బాస్టర్డు! వీడివల్ల అంతా బెడిసి కొట్టింది.

బాజ్జీ నా దగ్గరకొచ్చి అంటున్నాడు.

"మీరేదేనా చెప్పదల్చుకున్నారా, కిరణ్?"

అతన్ని చూసి బలహీనంగా నవ్వాను.

"చాలా చెప్పాలి, ఇన్ స్పెక్టర్....కొన్ని కాయితాలు, కలం యివ్వండి—వ్రాస్తాను."

"దట్స్ గుడ్!" అతను నవ్వుతూ వెళ్లిపోయాడు.

సరే! ఒక విషయంలో మాత్రం నాకు తృప్తి లభించింది. ఈ ఇన్ స్పెక్టర్ నాతో ఎంతో స్నేహ

పూర్వకంగా ప్రవర్తిస్తున్నాను. గతంలో ఏ పోలీసూ నాతో ఇలా ప్రవర్తించలేదు. ఇందుక్కారణం నాకు తెలుసు. నేనిప్పుడు డబ్బుగలవాడ్ని! నా ప్రస్తుత హోదా మళ్ళీ చిత్రహింసలకి గురికాకుండా కాపాడుతోంది!

నా నేరస్థ జీవితం ఇంత ప్రతిష్టాకరంగా ముగుస్తుందని ఎప్పుడనుకున్నాను?

బాడీ తిరిగివచ్చి కాయితాలూ కలం ఇచ్చాడు.

"ఇన్స్పెక్టర్. నేనో విషయమడగాలి...." అన్నాను నెమ్మదిగా.

"ఏమిటి?" అన్నాడతను నవ్వుతూ.

"విమల చనిపోలేదా....?" అడిగాను సందేహిస్తూ.

అతను వింతగా చూశాడు. "ఈ అనుమానం ఎందుకొచ్చింది? ఆమె చావును మీరే కళ్ళారా చూశారు."

"లేదు ఇన్స్పెక్టర్, ఆమె నిందాకే చూశాను...."

"చూశారా? ఎక్కడ?"

"బయట....పోక చెట్టు క్రింద. తెల్లచీరలో తల విరబోసుకుని—నిశ్చలంగా మాస్తూ కన్పించింది...."

అతను నవ్వాడు, "ఆమె చనిపోయింది, కిరణ్! బ్రతికుందనుకుంటే అది మీ అమాయకత్వం. దెయ్యమైందనుకుంటే అది మీ భ్రమ. మిమ్మల్ని వెంటాడుతున్న భయాలే ఆమె దెయ్యం రూపంలో సాక్షాత్కరించాయి"

కళ్ళు గట్టిగా మూసుకున్నాను. భ్రమ! ఎంతలో నా భవిష్యత్తును మలుపు తిప్పింది! నా పాపిష్టి ఆవేశంతో నిగ్రహం తప్పి ఎంత అవివేకంగా ప్రవర్తించాను!

ఇక ఇప్పుడు నా బ్రతుకంతా చీకటి! ఇది అంతులేని రాత్రి. మరపురాని రాత్రి. ఈ రాత్రి ఇక తెల్లారదు!

—: ఐపోయింది :—

## (పదవ భాగము)

విచిత్రంగా మెలికలు తిరుగుతున్న ఆ ఆకారం సైజు తెల్సుకోవడం అసాధ్యంగా భావించాడు రాణా.

దాన్ని ముందు, వెనుకా, అటూ, ఇటూ, పొరలు పొరలుగా దట్టంగా కదుల్తున్న పొగవల్ల స్పష్టంగా చూడలేక పోతున్నాడు రాణా.

కాని అతనిక్కనబడ్డ దృశ్యం, విచిత్రంగా, భయాందోళనలు రేకెత్తించేదిగా ఉంది....

స్థాణువులా నిలబడి చూస్తున్న రాణా అతి కష్టం మీద దృష్టి మరల్చుకొని, తన ప్రక్కగా ఉన్న యంత్రం వద్ద మోకాళ్ళమీద వంగి కూర్చున్నాడు.

ఆక్సిజన్ మాస్క్ జ్ఞాపకంవచ్చి చటుక్కున దాన్ని తగిలించుకున్నాడు, స్మోగ్ మాస్క్ వేరుచేసి.

ఆక్సిజన్‌ని నాలుగైదుసార్లు బలంగా పీల్చిన తర్వాత మస్తిష్కం తేలిక పడినట్లయింది రాణాకి. విష మేఘానిక్కూడా మత్తుకల్గించే లక్షణం ఉందా అని ఆశ్చర్యపోయాడు.

వాక్యూమ్ కంటైనర్‌కి ఉన్న లోహపు గొట్టాలు వేరు చేసి, కలగలుపుతూ స్క్రూ బిగించసాగాడు, తను చేయబోయే పనికి ఒకవంక భీతిల్లుతూ....

మెరిసే ఆ ముద్దలాంటి పదార్థాన్ని తాను సమీపించగలడా? అన్న అనుమానం యింకా అతన్ని వేధిస్తోంది.

కాని సైంటిస్టు విశ్వామిత్ర ప్రమాదకరమైన మార్పులు చేసి సృష్టించిన మైక్రోప్లాస్మా అది!

కొద్ది సేపట్లో నిజం బైట పడుతుంది.

అకస్మాత్తుగా ఏవో ఆకారాలు కదుల్తూ వస్తున్నట్లు కనుసన్నల్లోంచి గ్రహించి, బిక్కచచ్చిపోయాడు రాణా.

పైకిలేచాడు గాభరాగా, చేతిలోని లోహపు గొట్టంతో. ఆకారాల్లో వొకటి దగ్గరగా వచ్చింది.

ఆ ఆకారం మనిషి ఆకారమని గ్రహించి, బరువుగా నిట్టూర్పు వదిలాడు రాణా.

తలకు ఏదో పురాతనమైన గాస్ మాస్క్ వుంది. ఆ వ్యక్తి చేతిలో లావుగా పొడువుగా ఉన్న కొవ్వొత్తి వెలుగుతోంది....

"ఎవరు నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?"

రాణా అడిగాడు సందిగ్ధంగా, సంభాషణకు వీలుగా ఆక్సిజన్ మాస్క్ తొలగిస్తూ.

జవాబు లేదు....

ఆ వ్యక్తి రెండడుగులు ముందుకు వేశాడు....

"విషమేఘం చాలా డేంజరస్! మిగతావాళ్ళతో ఎందుకు వెళ్ళిపోలేదు?"

జవాబు లేదు.

అకస్మాత్తుగా ఆగంతకుడి చేతిలో కొవ్వొత్తి పైకి లేచింది, రాణా ముఖాన్ని కాల్చడానికి సన్నద్ధమౌతూ.

రాణా ఆలస్యం చేయలేదు.

చేతిలోని లోహపు గొట్టంతో అతని కడుపులో బలంగా పొడిచాడు.

ఆ వ్యక్తి తల వంచి, కడుపు పట్టుకున్నాడు బాధగా.

అంతే! లోహపుగొట్టం ఈసారి అతని మెడమీద బలంగా విరుచుకుపడింది.

ఆ వ్యక్తి కుప్పలా కూలిపోయాడు, కిక్కురుమనకుండా.

గొట్టాన్ని మళ్ళీ పైకెత్తాడు రాణా, మిగతా యిద్దరి కోసం రెడీ అవుతూ—

వాళ్ళు అప్పటికే మాయమయ్యారు.

రాణా అటూ ఇటూ చూసాడు, ప్రమాదంకోసం పొంచి చూస్తూ.

అతని కాళ్ళదగ్గర ఆకారం బలహీనంగా మూల్గుతోంది. పొగమంచు నుండి రక్షణ లభిస్తుందని అతను గాస్ మాస్క్ ధరించి వుండాలి—ఆ అవకాశాన్ని వినియోగించుకొని నిర్మానుష్యమైన టౌన్‌లో విలువైన వస్తువులు దొంగిలించడాన్కి బయలుదేరి వుంటాడు.

కాని ఆగంతకుడు, మిగతా వ్యక్తులు ఈ పురాతన భవనంలో ఏమి చేస్తున్నారు??

తననెందుకు ఎటాక్ చేసాడితను?

వ్యాధి అప్పుడే వారికి సోకిందా?

లేక వారి స్వేచ్ఛకు తాను ఆటంకమని భావించి ఎదురు దెబ్బ తీయడాన్కి ప్రయత్నించారా?

కాళ్ళదగ్గర మూల్గుతున్న ఆగంతకుడి మాస్క్ చటుక్కున తొలగించాడు రాణా.

అంతే?

స్థాణువులా నిలబడిపోయాడు రాణా.

అతని కళ్ళు తళతళా మెరుస్తున్నాయి—విచిత్రంగా.

ఆ మెరుపు లూసీ చూపుల్లాగే—

సందేహంలేదు!

అతనిలో ఉన్మాదం ప్రవేశించింది!

దీస్ ఆర్ ల్యూనటిక్స్!!

వెనక అడుగుల చప్పుడు విని, గిరుక్కున వెనుదిరిగాడు రాణా.

అప్పటికే ఆలస్యమైంది.

అతని గడ్డంపై ఎవరిదో పిడికిలి వజ్రాఘాతంలా తగిలింది.

రాణా వెనక్కి తూలిపడ్డాడు, లోహపుగొట్టం చేతి

లోంచి జారిపోతుండగా....

ఓ ఆకారం అతని మీదకు వంగి నిలబడి పిచ్చివాడిలా నవ్వసాగింది.

ఒళ్ళు గగుర్పొడిచే ఉన్మాది వికటాట్టహాసం! మూడో వ్యక్తి పొగమంచులోంచి ప్రత్యక్షమై, తన సహచరుడి ప్రక్కనచేరి, విజయగర్వంతో నవ్వడం ప్రారంభించాడు. అకస్మాత్తుగా వారిద్దరూ ముందుకువంగి, రాణా చేతులు, కాళ్ళు, పట్టుకుని, ఆ రాతి నేలమీద 'వెలుగు' వైపు ఈడ్చుకుంటూ వెళ్ళసాగారు.

రాణా కాళ్లు చేతులూ గింజుకోసాగాడు కేకలువేస్తూ. అతని విఫలప్రయత్నం చూసి, మరింత గట్టిగా నవ్వసాగారా పిచ్చివాళ్ళు.

ఉన్మాదులు ఈడ్చుకుంటూ వెళ్తున్న రాణా శరీరానికి యింతకుముందు దెబ్బలుతిని పడివున్న మొదటి వ్యక్తి శరీరం అడ్డం వచ్చింది.

తమ గమనానికి అడ్డురావడంతో ఉన్మాదులు రెచ్చిపోయి విచిత్రంగా అరుస్తూ, రాణా శరీరాన్ని వదిలేసి-యిద్దరినీ కలిపి కాళ్ళతో తన్నసాగారు.

మూల్గుతున్న మొదటి వ్యక్తి తమ సహచరుడన్న జ్ఞానం వారికిలేదు.... రెండోవ్యక్తి అతన్ని-జుట్టు చేత్తో పట్టుకుని నేలకు బాదుతున్నాడు....

రాణా చటుక్కున ట్రాలీ మెటల్ గొట్టం అందుకుని ఫెడీలుమని మూడోవ్యక్తి మెడమీద చరిచాడు.

అతని మెడ అందుకుని గట్టిగా నొక్కుతూ దూరంగా విసిరికొట్టాడు.

హఠాత్తుగా, రాణా మెడచుట్టూ రెండోవ్యక్తి ఉక్కుహస్తాలు బిగుసుకున్నాయ్.

క్షణాల్లో రాణా కళ్ళు మసకలు కమ్మాయ్....

ముఖం ఉబ్బి—ఊపిరి స్తంభిస్తోంది—

రక్తనాళాలు పగుల్తాయేమోనని భీతిల్లిపోయాడు రాణా. మెల్లగా మోకాలు మడిచి, వెనకవున్న వ్యక్తి పొత్తికడుపులో బలంగా కుమ్మాడు.

ఆ వ్యక్తి గింగుర్లు తిరుగుతూ వెనక్కి తూలిపడ్డాడు.

రాణా వూపిరి పీల్చుకోడానికి సమయం దొరికింది.

మొదటివ్యక్తి లేచినిలబడి ఆయిద్దరి వైపూ వేలు చూపిస్తూ పకపక నవ్వసాగాడు.

ఇక ఆ వాతావరణాన్ని యెంతమాత్రం భరించలేక పోయాడు రాణా.

తూలుకుంటూ, ఆ భవనంలోంచి బైటికి పరిగెత్త సాగాడు....

వెనకాల అడుగుల చప్పుడు....

ఎదురుగా దట్టమైన పొగలో ఏమీ కనబడ్డంలేదు. తాను పచ్చిక మైదానంలో పరిగెడుతున్నట్లు గ్రహించాడు రాణా........

ప్రస్తుతం ఆ పిచ్చివాళ్ళ బారినుండి ప్రాణాలు రక్షించుకోవడమే రాణా ఉద్దేశం.

పీడకలలా అల్లుకున్న ఆ విషమేఘం దృశ్యంనుండి బైటపడ్డమే ప్రస్తుతం రాణా వుద్దేశం.

తిరిగి బయట ప్రపంచంలోని మామూలు మనుషులను కల్సుకోవడం కోసం అతని ప్రస్తుత తాపత్రయం....

నరకంలోంచి పారిపోతున్నట్లు ఫీలౌతున్నాడు రాణా.

అతను పూర్తిగా తన బాధ్యత మర్చిపోయాడిప్పుడు.

బ్రతికి బైటపడాలన్న ఆరాటమే యిప్పుడు అతన్ని నడిపించే శక్తి....

బాణంలా దూసుకుపోతూ, పొగమంచులో చెమటలు కక్కుకుంటూ పరిగెడుతున్న రాణా, బురద నేలమీద కాలు జారి.... రివ్వున ముందుకు జారాడు మరింత వేగంగా. బాలన్స్ నిలదొక్కుకునే ప్రయత్నం విఫలమై ఓ వృక్షాన్ని గుద్దుకున్నాడు రాణా.

రప్పున అతని తల గుద్దుకుంది వృక్షాన్ని.

మోకాళ్ళు పట్టుతప్పి, జారిపోయి స్పృహకోల్పోతూ నేలమీద బోర్లా సాగిలబడ్డాడు రాణా.

* * *

మరాఠా దుర్గం మైదానంలో ఒక పిచ్చివాడు, గొయ్యితవ్వి తనను సజీవసమాధి చేస్తుండగా రక్షించబడ్డాడు రాణా సెర్చింగ్ పార్టీ చే. అనుకోకుండా వీచిన పెనుగాలులవల్ల, వర్షంవల్ల, విషమేఘం తేలుకుంటూ ఆ పట్టణాన్ని వదిలి వెళ్ళిపోయింది....

హెలికాప్టరు మరాఠాదుర్గం చుట్టూ చక్కర్లు కొట్టసాగాయి రాణా ఆచూకీ కోసం....

దుర్గం వెనుక భాగంలోని తోటలో ఎవరో వ్యక్తి గొయ్యితవ్వుతుండగా కనిపించింది ఓ హెలికాప్టర్ లోని సెర్చింగ్ పార్టీకి.

కానీ హెలికాప్టర్ క్రిందికి దిగి, ఆ వ్యక్తిమీద ఎగురుతున్నప్పుడు కానీ అర్థంకాలేదు పైలట్ ఆ వ్యక్తి చేసేది గొయ్యి తవ్వడంకాదనీ, గొయ్యి కప్పెడుతున్నాడనీ.

క్రూ మెంబర్ గాభరాగా పైలట్ భజాన్ని తట్టాడు.

"గెట్ డౌన్ దేర్!....క్విక్లీ!" పొలికేక పెట్టాడతను యింజన్ హోరులో వినబడేలా "ఆ గోతిలో ఎవరిదో శరీరం ఉంది.... వాడు దాన్ని కప్పెడుతున్నాడు!"

ఉన్మాదిగా మారిన ఆ దొంగ హెలికాప్టర్ హోరు

వినికూడ చలించలేదు.... గాభరాపడలేదు....

నవ్వుతూ, తనపని తాను చేసుకుంటూ పోతున్నాడు, పారతో గోతిలో స్పృహకోల్పోయి ఉన్న రాణామీద యిసుకపోస్తూ.

మీద, యిసుక పడుతుండగా రాణా శరీరంలో మెల్లగా చలనం వచ్చింది.... సన్నని మూల్గుతో....

స్పృహలోకి వస్తూ, చేయి పైకెత్తాడు రాణా తల మీద బొప్పివైపు—మరింతగా మూలుగుతూ.

అంతే!

పారనిండా కూడుకున్న ఓ మట్టి పెళ్ళ, ఢెళ్లున అతని ముఖంమీద పడింది.

అతని నోట్లోకీ, కళ్ళల్లోకి యిసుక విసురుగా ప్రవేశించింది.

రాణా ఊపిరందక ఉక్కిరిబిక్కిరయ్యాడు.

దగ్గుతూ లేచి కూర్చోడానికి ప్రయత్నించబోయాడు కానీ తలలో విపరీతమైన బాధ అతని ప్రయత్నాన్ని విఫలం చేసింది.....

చేతులతో ముఖంమీద మట్టి తొలిగించుకున్నాడు రాణా, అయోమయావస్థలో....

యిసుక పెళ్ళలు, యింకా తనమీద పడుతున్నాయని గ్రహించాడు రాణా....కాని ఎందుకో అతనికి అర్థం కాలేదు....

"కికికిక్కికి...." కోడి కెక్కిరించినట్లు ఎవరిదో నవ్వు వినబడ్డంతో త్రుళ్ళిపడ్డాడు రాణా.

అతనికి గొయ్యి అంచు కనబడింది....

బయటనుంచి ఎవరో పారతో తనమీద యిసుక పోస్తుండటం కన్పించింది....

ఏం జరుగుతుందో, ఎక్కడున్నాడో గుర్తు తెచ్చుకున్న రాణా అదిరిపోయాడు.

తను....సజీవంగా సమాధి అవుతున్నాడు!!

ప్రాణభయంతో, జారుతున్న గోతి అంచుల్ని పట్టుకుంటూ లేచి కూర్చున్నాడు రాణా!

నిరాటంకంగా సాగుతున్న పనికి, భంగం కలిగినందుకు పళ్ళు బిగించి జంతువులా అరిచాడు ఉన్మాది, పారతో రాణాను కొట్టబోతూ.

యిరుకు గోతిలో ఉన్న తాను ఆ దెబ్బను తప్పించుకోడం దుర్లభమని వాపోతూ, అప్రయత్నంగా చేతులు అడ్డంపెట్టాడు రాణా.

కాని దెబ్బ—లాండ్ కాలేదు.

బయట ఎవరివో కేకలు వినబడుతున్నాయి....

కళ్ళు తెరిచి, ఈసారి స్పష్టంగా చూసాడు రాణా. దీర్ఘచతురస్రాకారంలో మబ్బులు కమ్మిన ఆకాశం మాత్రమే కనబడిందతనికి.

అప్పుడు గ్రహించాడు 'రాణా, గోతిలోనికి వర్షపు చినుకులు పడుతున్నట్టు....

చినుకులతడి, శరీరాన్ని తాకగానే పూర్తి స్పృహలోకొచ్చాడు రాణా.

* * *

రాణా ఆందోళనగా, కారిడార్‌లో నడుస్తున్నాడు అబ్జర్వేషన్ గదివైపు.

లూసీ అందులో విశ్రాంతి తీసుకుంటున్నట్లు రాణాకు తెలియజేయబడింది.

మెడికల్ రీసెర్చి భవనానికి తిరిగిరాగానే, జులేఖాను కల్సుకోడానిక్కి అవకాశం లేకపోయింది రాణాకు.

ఒకవైపు మహారాష్ట్రలోని అన్ని ఆసుపత్రులకు సూచనలిస్తూ, మరోవైపు లూసీని శ్రద్ధగా పరీక్షిస్తూ, రాత్రంతా అలిసిపోయింది జులేఖా.

ప్రస్తుతం గాఢనిద్రలో ఉంది.

సరోజ డాక్టర్ చెప్పాడు రాణాకి, లూసీపై రేడియోలజీ ట్రీట్‌మెంట్ సంతృప్తికరంగా ముగిసిందనీ, ఆమె ప్రస్తుతం మత్తుమందు ప్రభావంతో నిద్రిస్తోందనీ, మేలుకొన్న తర్వాతగానీ, పూర్తిగా 'ఉన్మాదం'నుండి స్వస్థత చేకూరినిదీ లేనిదీ తెలియదని.

రాణాకు కూడా అనిపించింది నిద్రపోవడం ఎంతో అవసరమని—

ఉదయం అతను పొందిన భయంకరమైన అనుభవం— అతనిలో ఓపికనీ, శక్తినీ నిస్సత్తువ చేసింది.

స్పృహలోకి వస్తూండగా, తను ఓ సమాధిలో ఉన్నట్లు తెల్సుకోవడం, ఎవరో తనను కప్పెడుతున్నట్లు గ్రహించడం—ఏ మనిషికైనా ఒళ్ళు గగుర్పొడిపించే దారుణమైన అనుభవం!

తాము సజీవంగా సమాధి అవుతున్నట్లు సాధారణంగా చాలామంది పీడకలలో చూస్తారు.

ఆ అనుభవం నిజజీవితంలో చాలా తక్కువమందికి ఎదురౌతుంది.

ఆ రోజుకి యిక తిరిగి, విషమేఘంలోకి పంపే ఉద్దేశం ఎవరికీ లేదని గ్రహించి సైనికదళం—హెలికాప్టర్ మీద తిరిగి బొంబాయి తరలించింది రాణాని.

ప్రొఫెసర్ అశ్వత్థామ, రాణాకు బాడీగార్డుగా నియమితుడైన ఇన్‌స్పెక్టర్ రైనా, అతనితోపాటు హెలికాప్టర్‌లో బొంబాయి తిరిగివచ్చారు.

మైక్రోప్లాస్మా శాంపిల్ లేకుండా, రాణా వెనుదిరిగి రావాల్సి వచ్చినందుకు ప్రొఫెసర్ అశ్వత్థామ చాలా ఆశాభంగం చెందాడు. కాని ఆయన రాణాకు కలిగిన భయంకర అనుభవం అర్థం చేసుకొని, మళ్ళీ వెంటనే ప్రయత్నం చేయమని ఒత్తిడి చేయలేదు.

విష మేఘం కూడా, యిప్పుడు ప్రయోగాలు చేయడానికి వారికి అనుకూలంగా లేదు.

వాతావరణంలో హఠాత్తుగా ఏర్పడ్డ మార్పులువల్ల— అతి వేగంగా ప్రయాణిస్తోంది....

విష మేఘం ప్రయాణించే మార్గంలోని ప్రాంతాలన్నీ సైనికదళాల సహాయంతో, మనుషులు మసలకుండా ముందుగా ఖాళీచేయబడుతున్నాయ్....

అదృష్టవశాత్తూ విష మేఘం అధిక జనాభా గల పట్టణాలవైపు ప్రయాణించడంలేదు.

గింగుర్లు తిరుగుతూ ప్రయాణిస్తున్న విష మేఘం— ముందుగా పరిగెడుతున్నాయి పోలీస్ ట్రక్కులు, మిలటరీ వాహనాలు,—ఆ దిశలోని చిన్న-చిన్న గ్రామాల్లోని జనాన్ని ఖాళీచేయించి, ట్రక్కుల్లోకీ, వానుల్లోకీ ఎక్కించమని ప్రమాదానికి దూరంగా రవాణా చేయిస్తూ....

ఆ వాహనాలు—సురక్షిత ప్రాంతాల్లో జనాన్ని అన్‌లోడ్ చేసి తిరిగి అతివేగంగా మరో మార్గంగుండా దూసుకువెళ్తున్నాయి....మరల మరల అదే పద్ధతిని రిపీట్ చేస్తూ....

తీవ్రమైన మనఃక్లేశాన్ని — అలసటను కలగజేసే విధానం అది.

కాని మొత్తానికి ఆ కార్యక్రమం ఉపయోగకరంగా

నిరూపణ అయింది.

దురదృష్టవశాత్తూ—ఆ పద్ధతి—నిర్విరామంగా కొన సాగించడానికి అనుకూలం కానిది.

ఆ—ఆపరేషన్ నిర్వహించే వ్యక్తులు అనుక్షణం భయపడుతున్నారు—విష మేఘం పెద్ద పట్టణాల్లో ప్రవేశిస్తుందేమోనని....

ముఖ్యంగా బొంబాయి మహా నగరంలో విష మేఘాన్ని అడుగుపెట్టనివ్వొద్దని వారంతా వాయుదేవుణ్ణి ప్రార్థిస్తున్నారు....

విష మేఘం యిప్పుడు మైలుదూరం విస్తీర్ణంలో ఉండి ఆకాశ రాక్షసిలా పయనిస్తోంది....

రోడ్లమీద అనేకచోట్ల ట్రాఫిక్ బంద్ అవుతోంది...

దాన్ని అంత దూరంలో చూసిన ప్రజలు—భీతావహులై పారిపోవడం ప్రారంభిస్తున్నారు....

ప్రధాన మంత్రి ఢిల్లీ వచ్చిన వెంటనే రాజధానిని వదిలిపెట్టారు!

యిప్పుడు ఆయన బొంబాయిలోని ఓ భూగర్భ రహస్య స్థావరంనుండి—అనేక రిలీఫ్ కార్యక్రమాలకు మార్గ దర్శకత్వం వహిస్తున్నారు, వైద్య, విజ్ఞాన, సైనిక సలహాదారులతో. అవిచ్ఛిన్నకరమైన, ఈ సురక్షిత స్థావరం—నావల్ ఆపరేషన్స్ భవనాలకి దగ్గర్లో ఉంది; భూగర్భంలో.

భారతదేశంలో—ప్రఖ్యాతి వహించిన ఆ బొంబాయి మహానగరంలో—ఈ విష మేఘం రాక్షసి అడుగుపెట్టి నట్లయితే, కొంతమందిని ఈ సురక్షిత భూగర్భ స్థావరానికి తరలించడానికి జాగ్రత్తలు తీసుకోబడ్డాయి.

శత్రు దేశాలు ఎప్పుడైనా అణుబాంబు ప్రయోగిస్తే

ఆ రేడియేషన్, విషవాయువు ప్రమాదాలనుండి ప్రాణం రక్షించుకోడానికి, ముందు చూపుగా, అత్యాధునికమైన సాంకేతిక రక్షణలతో, ఈ భూగర్భ నివాసం నిర్మించబడింది.

ప్రస్తుతం కనీ వినీ ఎరుగని విచిత్ర ప్రమాదం—విష మేఘం—బారినుండి రక్షణ కల్పించుకోవడాన్కి ఉపయోగించబడడాన్కి సిద్ధంగా ఉంది.

విష మేఘాన్ని, విచ్ఛేదన పర్చడాన్కి బొంబాయి నగరంలో అక్కడక్కడా మంటలు అమర్చే ప్రతిపాదన ఒకటి బయలుదేరింది.

కానీ, తప్పనిసరి పరిస్థితుల్లో మాత్రం, ఆ విధంగా చేయాలని, పురవీధులనిండా మంటలు ఏర్పాటుచేస్తే నగరం అగ్ని ప్రమాదానికి ఆహుతయ్యే ప్రమాదం ఉందని, సూచించింది ప్రభుత్వం.

ఉన్మాద వ్యాధిని, పరిహరించే విరుగుడు మందు తయారవుతోందనీ, తర్వాత భారీ ఎత్తున ఈ మందు ఉత్పత్తి చేయబడుతుందనీ, అయినా విష మేఘం నెమ్మదిగా ప్రభావాన్ని కోల్పోతోందనీ, పరిశుద్ధమైన గాలిలో యిది కరిగిపోయి త్వరలో మాయమయ్యే అవకాశం లేకపోలేదనీ, ప్రజలకు నచ్చ చెబుతోంది ప్రభుత్వం.

విచిత్రంగా ఈ విష మేఘం సముద్రంనుండి బయలు దేరినదని, మేధావులు చెబుతున్నారనీ, అది ఎలా ఏర్పడిందో పరిశోధించేందుకు, సంక్షోభంనుండి బైట పడగానే విచారణ జరిపించగలమనీ కూడా వాగ్దానం చేసింది ప్రభుత్వం.

ప్రభుత్వం ఈ విధంగా అబద్ధమాడక తప్పలేదు.

నిజం వెల్లడిస్తే—ఎట్టి ఉపయోగం లేకపోగా, ప్రజానీకంలో భారీ ఎత్తున భయాందోళనలు రేగి, అగ్నికి, ఆజ్యంపోసినట్లవుతుందని తెల్సు. ప్రమాదం తప్పగానే పూర్తి నిజం—లేదా అందులో కొంత భాగం—బయట పెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది.

దానికి బాధ్యులైనవారికి శిక్ష పడుతుంది—బహిరంగంగా కాదు. ఈ రకమైన ప్రమాదాలు మరోసారి ఏర్పడకుండా చర్యలు తీసుకోబడతాయి.

బస్సీన్ పట్టణంనుండి, బొంబాయికి చేసిన తిరుగు ప్రయాణంలో రాణా, ప్రొఫెసర్ అశ్వత్థామ ముందు తన సందేహాలు ఏకరువు పెట్టాడు.

మార్పులు చేయబడ్డ మైక్రోప్లాస్మా, మరాఠా దుర్గంలో పొరపాటున ట్రాప్ అయిందా? లేక తనకు కావాలనే అక్కడ ఆశ్రయం తీసుకుందా?

దానికి—తనంతగా తాను కదిలే శక్తి ఉందా?

దానికి....ఆలోచించి, ఆచరించే శక్తి ఉందా?

ప్రొఫెసర్ అశ్వత్థామ నవ్వాడు, హాస్యం ధ్వనించకుండా....

"జీవమున్న ప్రతి జీవికీ చలనశక్తి ఉంటుంది రాణా! ఒక మొక్కకు కూడా బుద్ధి కుశలత ఉంటుంది. బట్... ఇటీజ్ ఎ మాటర్ ఆఫ్ డిగ్రీ! కాని, ఈ ఆర్గానిజానికి ఆలోచించే శక్తి ఉంటుందని చెప్పలేం. బహుశా, జీవించడం కోసం ఒక విధమైన కదలిక శక్తి ఉంటుంది. అంతే....ప్రొద్దు తిరుగుడుపువ్వు సూర్యుడివైపు ఎందుకు తిరుగుతుంది? అలాంటి చలనశక్తి. అంతే! దానికి ఆలోచించే....నో మిస్టర్ రాణా! నీ కెదురైన భయంకరమైన అనుభవం, నిన్ను ఫాంటసీలోకి తీసుకువెళ్తోంది.

"మైక్రోప్లాస్మా, పొగ పుంచుని కంట్రోల్ చేయలేదు. గాలితాకిడి, ఈ మేఘాన్ని దూరంగా కొట్టుకుపోయేట్లు చేసినపుడు, దానితో పాటుగా వచ్చినట్లు మధ్యలో ట్రాప్ అయిన మైక్రోప్లాస్మా ప్రయాణించవల్సిందే! చుట్టూవున్న ఆ మేఘం—మధ్యలోవున్న మైక్రోప్లాస్మాకు ప్రొటెక్షన్. ఆ మేఘాన్ని అది శాసించలేదు! మైక్రో ప్లాస్మా ఈజ్ ఎ మైండ్ లెస్ ఆర్గానిక్ థింగ్, ఇన్ కాపబుల్ ఆఫ్ యాక్షన్ బై ధాట్!"

మిగతా ప్రయాణమంతా, మౌనంలో గడిపారిద్దరూ. పరిస్థితులు చక్కబడగానే, మైక్రోప్లాస్మా శాంపిల్ ని తప్పకుండా తెస్తానని రాణా, హోమ్ సెక్రటరీని కల్సి—ప్రామిస్ చేసిన తర్వాత రీసెర్చి సెంటర్ కి రాణాను అనుసరించాడు ఇన్ స్పెక్టర్ రైనా.

మనసంతా గజిబిజిగా ఉంది రాణాకి, లూసీని గూర్చిన ఆలోచనలో.

దడ-దడలాడే గుండెలతో, మూడవ నంబర్ ఉన్న డోర్ హాండిల్ త్రిప్పాడు రాణా.

అద్దంలో ఫిట్ చేయబడ్డ తలుపు పై భాగంలోంచి, లోపల బెడ్ మీద పేలవమైన ముఖంతో, వెనక్కి వాలి వున్న ఆకారాన్ని చూసాడు రాణా.

ఒక నర్సు ఆమె ప్రక్కగా కూర్చుని ఉంది—లూసీకి స్పృహ రాగానే జులేఖాని పిల్చేందుకు సిద్ధంగా.

రాణా లోపలికి ప్రవేశించగానే, నర్సు పలకరింపుగా నవ్వింది.

"హౌ ఈజ్ షి?" ఆత్రంగా అడిగాడు రాణా.

"గాఢమైన నిద్రలో ఉంది. చాలా వయొలెంట్ గా ప్రవర్తించడం చేత, రేడియోలజీ చికిత్స చేసేముందు శక్తి

వంతమైన మత్తు మందు యిచ్చాం" అన్నది నర్స్.

"ఇక్కడ ఒంటరిగా కొంత సేపు నేను కూర్చోవచ్చా?"

"ఎస్ ఆఫ్ కోర్స్" నర్స్ సీట్లోంచి పైకి లేచింది నవ్వుతూ. "మీ రో ఐదు నిముషాలు యిక్కడ ఉండొచ్చు. కానీ ఆమె మేల్కొంటే ఈ బటన్ నొక్కండి. క్షణాల్లో ఈ గదినిండా మనుషులుంటారు. రేడియోలజీ చికిత్సా ఫలితం, తెల్సుకోడాన్కి మేమంతా ఆతృతగా ఉన్నాం."

"కోలుకున్న చిహ్నాలు కనబడడం లేదా?" అన్నాడు బెంగగా.

"ఓహ్. ది సైన్స్ ఆర్ గుడ్. కాని.... ఫ్రాంక్లీ మిస్టర్ రాణా! యిప్పుడే ఏమీ చెప్పలేం. డాక్టర్ జులేఖా, ఈ విషయం మీతో చర్చించి ఉండాలి."

రాణా తల ఊపి, ఆమె ఖాళీచేసిన కుర్చీలో కూలబడ్డాడు. నిస్సత్తువగా....

లూసీ నాడిని ఆఖరిసారి పరీక్ష చేసి ఆమె గది వదిలి పెట్టింది.

లూసీ ముఖంలోకి చూస్తూ చాల సేపు ఉండిపోయాడు రాణా.

తెల్లటి బెడ్ షీట్ క్రిందుగా, లూసీ చేతులు మంచాని కటు, ఇటు బంధించబడి ఉన్నాయని గ్రహించాడు రాణా.

అతని కళ్లల్లో వెచ్చటి కన్నీళ్ళు నిల్చాయి....

బిగ్గరగా ఏడ్చి, ఏడ్చి గుండెను తేలిక పర్చుకోవాలన్న కోరికను బలవంతంగా, గొంతుక వెనుక బిగపట్టాడు రాణా.

చేయి ముందుకు చాపి, వేళ్ళతో ఆమె చెక్కిళ్ళనీ, పెదిమలనీ, కంఠాన్ని స్పర్శించాడు రాణా.

ఆమెలో చిన్న కదలిక ఏర్పడింది.

ఒక్కక్షణం విల్లులాంటి ఆమె కనుబొమలు ముడుచుకొని, మళ్ళీ మామూలయ్యాయి.

అతను ఆమె పేరుని ఉచ్చరించాడు.

ఆమెను లేపడానిక్కాదు. అలా అనాలనిపించి.

ఒకక్షణం ఆమె కనురెప్పలు అల్లల్లాడాయి.

తర్వాత, ఆమె లేడికళ్ళు తెరుచుకున్నాయి....

ఆమె కళ్ళు, అతని కళ్ళవైపు చూసాయి.

ఆమె చూపుల్లో ఏ అర్థము ప్రస్ఫుటం కాలేదు.

గుండెలు గుబ-గుబలాడాయ్ రాణాకి.

మెదడు మొద్దుబారుతోంది అతనికి.

లూసీ తనను గుర్తించలేదా???

చివరి ఆశగా, జులేఖా శాయశక్తులా కష్టపడి చేసిన ప్రయత్నానిక్కి ఫలితం లేదా???

అప్పుడే—లూసీ, రాణా కళ్ళల్లోకి చూసి చిన్నగా నవ్వింది.

"ఐ లవ్ యూ రాణా! ఫరెవర్!" అందామె.

అంతే!

అంతే!

మళ్ళీ వెనక్కి ఒరిగిపోయింది, గాఢమైన నిద్రలోకి.

లూసీ పలికిన మాటలు రాణా చెప్పగానే, జులేఖా సంతోషం పట్టలేక చిన్నపిల్లలా అర్చింది....

కానీ, పూర్తి స్పృహలోకి రాకుండా—ఆమె మెదడు నార్మల్ గా ఫంక్షన్ చేసేదీ, లేనిదీ, తెలియదని—

ఆమెకు తెల్సు.

అలిసి, సొలసి వున్న రాణాను ఓ రెండు గంటలపాటు నిద్రపొమ్మని బ్రతిమాలి, శాసించి, అతన్ని ఓ గదిలో పడుకోబెట్టింది.

తర్వాత—లూసీ చార్ట్ స్టడీ చేయడాన్కి ఆమె బైటికి వెళ్ళిపోయింది.

మూడుగంటల తర్వాత యిన్స్పెక్టర్ రైనా—నిదిలేపాడు రాణాని.

"గుడ్ న్యూస్ యార్! షి ఈజ్ ఫైన్" చెప్పాడు రైనా. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు రాణా.

సంతృప్తిగా, నవ్వుతూ ముఖం రుద్దుకున్నాడు.

"గడ్డం పెరిగిపోయింది" అన్నాడు గొణుక్కుంటూ.

"ఆమె ఏమీ అనుకోదు."

"విషమేఘం గురించి మరేమన్నా విషయాలు తెల్సాయా?" హాంగర్కి తగిలించిన చొక్కా అందుకొని గబ-గబా తొడుక్కుంటూ అన్నాడు రాణా.

"భోలెడన్ని. ముందు నీ మొహబ్బత్ ని కల్సుకొని రా. తర్వాత చెప్తాను."

రాణా పెద్ద పెద్ద అంగలతో, అబ్జర్వేషన్ రూమ్ నెంబర్ త్రీకి చేరుకున్నప్పుడు, లూసీ బెడ్ మీద కూర్చొని జులేఖాతో మాట్లాడుతోంది.

గదిలోకి మాసుకు వస్తున్న రాణాని చూడగానే: ఆమె కళ్ళు మెరిశాయ్.... పెదవులు విచ్చుకున్నాయ్....

మరుక్షణం వారిద్దరూ ఆవేశంగా, ఒకరికొకరు పెనవేసుకుపోయారు....!

మహారాణా ఆమె నుదుటినీ, పెదిమల్నీ, చెంపల్నీ, కంఠాన్ని ముద్దుల్లో ముంచెత్తుతున్నాడు....

డాక్టర్ జులేఖా, యిన్‌స్పెక్టర్ రైనా, వేపు చూసి నవ్వింది.

ఇద్దరూ భుజాలెగరేసుకుని, న్యాయుద్ధంగా బైటికి నిష్క్రమించారు.

"యు ఆర్ ఆల్ రైట్ మై ఏంజెల్!" నవ్వుతూ అన్నాడు రాణా, ఆమె స్తనాల మధ్యగా ముద్దుపెట్టుకుంటూ.

"ఊ్మ్...." తల ఊపిందామె, రాణా జుట్టు సవరిస్తూ.

"నీ...." రాణా తటాపటాయించాడు, తల పైకెత్తి చూస్తూ "నీకేమైనా గుర్తున్నాయా?"

"కొన్ని విషయాలు రాణా!....అస్పష్టంగా...."

ఆమె ముఖం గంభీరంగా మారిపోయింది. ఆమె సూటిగా అతని కళ్ళల్లోకి చూడలేకపోతోంది.

"....నిన్ను .... చంపడానికి ప్రయత్నించడం గుర్తుంది."

రాణా, ఆమె నడుం చుట్టూ చేయివేసి దగ్గరగా లాక్కున్నాడు—మౌనంగా.

"అంతా అస్పష్టంగా ఉంది రాణా! రకరకాల ఆకారాలు, ప్రతిబింబాలు మస్తిష్కంలో కదలాడుతున్నాయి ...అన్నీ కల్సిపోయి గజిబిజిగా...." ఆమె అతని వీపుచుట్టూ చేతులతో పెనవేసుకుపోతూ ముఖాన్ని అతని ఛాతీమీద ఆన్చింది.

"ఫాదర్ ...." ఆమె కంఠం పూడ్చుకుపోయింది.

"లూసీ!" ఏదో చెప్పబోయాడు రాణా.

"ఆయన చచ్చిపోయాడు. అవునా?"

రాణా అప్రతిభుడయ్యాడు.

లూసీకి జ్ఞాపకముందా అది? (ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులుకాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అందచేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును. •



# ప్రేమలో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## బంగారం బేరం?

సుబ్బారావు హడావిడిగా ఇంట్లోకి ప్రవేశించి,

"ఏమేమ్....పట్టణంలోకి పెద్ద గజదొంగ ప్రవేశించి స్వైర విహారం చేస్తున్నారట. వెంటనే మనం బంగారు కొట్టుకెళ్ళి పది తులాల బంగారం కొనుక్కుందాం పద" భార్యను హెచ్చరించాడు.

"ఆదేమిటండీ....మీకేమన్నా పిచ్చా! పట్టణంలో గజదొంగ తిరుగుతుంటే మీరు బంగారం కొంటాననంటారేమిటి? దానివల్ల ఎంత ప్రమాదమో తెలుసా?" భార్య ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"అది కాదే....వాడు దోచుకునే ఇంట్లో పది తులాల బంగారం కంటే తక్కువ దొరికితే....ఆ ఇంట్లో వాళ్ళందరిని ముక్కలు ముక్కలుగా నరికేస్తాడట!!

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

## నల్ల పర్సు

పిక్చర్ విడువగానే గబగబా వచ్చి బస్సు ఎక్కి కూర్చున్నాడు ముకుందం. స్టార్టింగ్ పాయింట్ కాబట్టి సీటు దొరికింది.

పక్కకు తిరిగి చూశాడు. కళ్లు జిగేలుమన్నాయి. లేడీస్ సీట్లో తాను యింతకుముందు థియేటర్లోచూసిన అమ్మాయి లున్నారు.

చూడగానే లైట్నింగ్ లవ్ చేసేశాడు. చేసుకుంటే యిలాంటి అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు, ముకుందం.

టికెట్ తీసుకుని కాలికేదో తగిలితే క్రిందకు చూశాడు. నల్లటి పర్సు నిగనిగ లాడుతూ కనిపించింది.

ఒక క్షణం ఆలోచించి, తన సొంతం చేసుకోవాలనుకున్నాడు. కొంపతీసి పర్సు పోయిన మనిషి తిరిగి వచ్చి బస్సాపి చెక్ చేస్తే పరువు గంగలో కలవక తప్పదు. అదీ గాక తన వుడ్ బి ల ముందు. ఛ! ఛ! అనుకొని "కండక్టర్" అని గట్టిగా పిలిచి, దగ్గరకు రాగానే పర్సు అతని చేతికిచ్చి, పోలీసుల కప్పగించమని చెప్పి అమ్మణిలవైపు చూశాడు.

ఆ కళ్లు మెచ్చుకోలుగా చూడటం గమనించి కాలరు సర్దుకున్నాడు.

స్టేజీ రాగానే దిగి, రూముకెళ్ళి ఈ ఘనకార్యం మిత్ర బృందానికి చెప్పాలని కిళ్ళీకొట్టు ముందాగాడు సిగరెట్లకు.

జేబులో చెయ్యిపెట్టి కెవ్వుమన్నాడు. పర్సు....నల్లది ....తనదే! ఆ రోజే కొన్నాడు! కొంప మునిగింది అనుకొంటూ, పోలీసుస్టేషన్ వైపు పరుగెత్తాడు పాపం ముకుందం.

—ఆర్. వి. రఘునాథ్, మద్రాసు-15.

## పరిశోధన లేని కేస్?

ప్రముఖ డిటెక్టివ్ సుగ్రీవ్‌తో అతవి అసిస్టెంట్ వాలి:

"సార్! పోయిన వస్తువు యెక్కడుందో తెల్సినప్పుడు దానిపై పరిశోధన అనవసరం కదా!"

"యస్. కరెక్టు ...దాన్ని చిటికెలో తేవచ్చు. ఇంతకూ ఏవిటి?"

"ఇందాక మనం కారులో బ్రిడ్జిమీదుగా వస్తున్నప్పుడు మీ బ్రీఫ్‌కేస్ నదిలో పడిపోయిందార్—!!"

చల్లగా చెప్పాడు అసిస్టెంట్.

—నానిబాబు, విశాఖపట్నం-4.

## "అయ్యో, ఢిల్లీ వచ్చేసింది!"

ఒకసారి నేను ఢిల్లీ ప్రయాణం చేస్తున్నాను.

అది రైలులో ఫస్టుక్లాసు స్లీపర్‌కోచ్. అందులోనే ప్రయాణంచేసే ఒక శిక్కుగారు కండక్టర్‌ను పిలిచి,పలానా స్టేషన్ రాగానే నిద్ర లేపమని దిగిపోతాను అని చెప్పి ఎంచక్కా నిద్రపోయాడు.

శిక్కుగారు నిద్ర లేచేటప్పటికి రైలు ఢిల్లీ వచ్చేసింది.

ఇంక చూస్కోండి కండక్టర్‌మీద ఇంత ఎత్తున లేచాడు. కండక్టరేమో ఆశ్చర్యపోతున్నాడు. ఎందుకంటే, పాపం! ఈ శిక్కుగారే అనుకుని మరో శిక్కుని అక్కడ నిద్రలేపి దించేసేడట. ఇది విని అంత ఏడుపులోను శిక్కుగారికి నవ్వు ఆగిందికాదు. ఇక మా సంగతి చెప్పనే అక్కరలేదు.

—పి. కనకదుర్గ, మచిలీపట్టణం.

## "హిప్నాటిజం"

"మోహినీ విద్య అంటే ఏమిటి?" అనడిగింది కామేశ్వరి, స్నేహితురాలిని.

"ఇంగ్లీషులో ఆ విద్యని 'హిప్నాటిజం' అని పిలుస్తారు. ఓ వ్యక్తిమీద మోహిని విద్యను ప్రయోగించి, ఆ వ్యక్తిని మన స్వాధీనం చేసుకుని, అతనిచేత మనం చెప్పినట్టు నడుచుకొనేలాగ చేసుకోవడాన్ని మోహినీ విద్య— అంటారు" జవాబిచ్చింది స్నేహితురాలు.

"అంతపెద్ద పేరెందుకు "పెళ్ళి" అంటే సరిపోతుంది కదా" అంది ఆ ముద్దుగుమ్మ.

—ఎన్. నరసింహమూర్తి (రేణుశ్రీ),
తుంగభద్రా డ్యాం.

## పళ్ళు జాగ్రత్త!!

"ఏవిటోయ్....నీ ముందు రెండు పళ్ళు ఎలా పోయాయి?" ఆశ్చర్యంతో అడిగాడు రామారావు.

"దానిదేముందిలెండి... అయినా తొందర్లోనే మీ పళ్ళు కూడా వూడతాయిగా...." అన్నాడు సుబ్బారావు.

"ఆఁ....నా పళ్లు వూడతాయా? ఎలా?" గాబరాగా అడిగాడు రామారావు.

"ఆ....ఏవుందీ! ఈ మధ్య మీరు కూడా ఆ సురేఖ వెంట పడుతున్నారుగా!"

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.